THE

# ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES

[*Part II—Proceedings other than Questions and Answers*]

OFFICIAL REPORT

---

*Seventh Day of the Sixth Session of the Andhra Pradesh Legislative Assembly*

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Monday, the 4th November,* 1957

The House met at Half Past Eight of the Clock

[MR SPEAKER IN THE CHAIR]

## QUESTIONS AND ANSWERS

(SEE PART I)

## MOTION UNDER RULE 70 RE RETRENCHMENT OF 8000 LABOURERS OF MINES IN CHEEPURUPALLI Tq

మిస్టర్ స్పీకర్ . ఇప్పుడు రూలు 70 క్రింద ఒక మోషన్ వచ్చింది. దానిని శ్రీ యం సత్యనారాయణరాజుగారు ఇచ్చారు.

(Pause)

శ్రీ బి. శ్రీరామమూర్తి (విజయనగరం) . సత్యనారాయణరాజుగారు సభలో లేరండి నేను మూవ్ చేస్తాను

మిస్టర్ స్పీకర్ · వారు ఇచ్చిన మోషన్ చదువుతాను

"This House requests to allot an hour for discussion under Rule 70 of retrenchment of 8000 labourers of mines in Cheepurupalli Taluk, Srikakulam District."

ఎనిమిది వేల మంది కార్మికులను రిట్రెంచ్ చేశారన్నారు. కాబట్టి ఇది కొంతవరకు సీరియస్ మేటరు...

రెవెన్యూ మంత్రి (శ్రీ కె వెంకట్రావు) దీనిని గురించి నోటీసు ఇస్తే, ప్రభుత్వం తగిన సంజాయిషీ తీసుకువచ్చి, తర్వాత యీ సభముందు పెట్టటం జరుగుతుంది

మిస్టర్ స్పీకర్ దీనికి సంబంధించిన నోటీసు మంత్రిగారికి పంపినాము లీడర్ ఆఫ్ ది హావుస్‌కు కూడా పంపుతాము చీపురుపల్లి తాలూకాలో గనులలో నుండి ఎనిమిదివేల మంది లేబరర్స్‌ను తగ్గించారట ఆ సిట్యుయేషన్ను గురించి సభ్యులు డిస్కషన్ కోరుతున్నారు

ముఖ్యమంత్రి (శ్రీ ఎన్ సంజీవరెడ్డి) అధ్యక్షమహాశయా, అది కొత్త విషయం కాదండి గరివిడిలో వాగన్సు లేవని, మాంగనీస్ స్టాకు ఎక్కువ ఉండిపోయిందని వారు పని స్టాప్ చేశారు అది పలుమార్లు వస్తున్న ట్రబులే వాళ్లకు వాగన్సు లేకపోవటంవల్ల, వారి సరుకు బయటకు పోకపోవటం వల్ల ఇంతమందిని రిట్రెంచ్ చేయటం ఉన్నది వారిని తిరిగి ఎంప్లాయి చేయటం ఉంటుంది, స్టాకు కావలసివచ్చినపుడు వారిని తిరిగి ఎంప్లాయి చేస్తున్నారు పని తక్కువ అయినపుడు వారిని తాత్కాలికంగా తీసివేస్తున్నారు. అంతమాత్రాన వారిని కంప్లీట్‌గా రిట్రెంచ్ చేశారనికాదు పని కావలసివచ్చినపుడు వారిని రి-ఎంప్లాయ్ చేయటం జరుగుతుంది ఇదివరకు దీనిని గురించి ఒక ప్రశ్న వేశారు ఆ క్వశ్చన్‌కు అసెంబ్లీలో ఆన్సర్ చేశాము ఇది మూడు నాలుగు నెలలుగా జరుగుతున్నటువంటి విషయము ఇది తక్షణమే ఏర్పడిన విషయం కాదని మాత్రం చెబుతున్నాను.

*శ్రీ బి. శ్రీరామమూర్తి. ఇది కేవలం కేంద్రప్రభుత్వానికి సంబంధించిన విషయము అందుచేత రాష్ట్రప్రభుత్వం ప్రత్యేకించి చేయకలిగిందేమీ ఉండదు కాని ఒక విషయం మాత్రం ఉన్నది ఎనిమిదివేల కార్మికులకు వృత్తులు పోయినపుడు, ఆ విషయంలో మన ప్రభుత్వము జోక్యము కలిగించుకోవలసిఉంటుంది వాగన్లు సప్లయికాకపోవటం వల్ల గనులు మూసిన విషయం నిజం వాగన్సు సత్వరం సప్లయిచేయాలని కేంద్రప్రభుత్వానికి రాష్ట్రప్రభుత్వం చెప్పటం సాధ్యమవుతుంది కాబట్టి. కేంద్రప్రభుత్వంపై యీ ప్రభుత్వం వత్తిడిచేయటం సాధ్యమవుతుంది కాబట్టి. అవని చేయాలని కోరుతున్నాను. వాగన్సు సప్లయి జరిగేంతవరకు. ఉన్నటువంటి మాంగనీస్‌ను లారీలతో విశాఖపట్నం సరఫరా చేయవచ్చునని రాష్ట్రప్రభుత్వం మాంగనీస్ ప్రొప్రయిటర్స్‌కు సూచించవచ్చును ఈ విధంగా లారీలు సప్లయిచేయటంలో, రాష్ట్ర ప్రభుత్వం మాంగనీస్ ప్రొప్రయిటర్సుతో సహకరించాలని కేంద్ర ప్రభుత్వము రాష్ట్ర ప్రభుత్వానికి [illegible] తెలుపుతున్నది. కాబట్టి ప్రభుత్వం యీ విషయంలో కొంతవరకు పని

చేయవచ్చును ఈ రోజున కార్మికులు చాలా ఆందోళనపడుతున్నారు ప్రభుత్వం వారు వారి కష్టాలు తీర్చటానికి ఏమి ఏర్పాట్లు చేస్తున్నారో, వారి ఆందోళనను పోగొట్టటానికి ఏమి పనులు చేస్తున్నారో ప్రకటించాలని కోరుతున్నాను

శ్రీ ఎన్ సంజీవరెడ్డి ఇంతకు ముందుగానే కేంద్ర ప్రభుత్వానికి వ్రాశాము మేము యీ విషయములో చేయగలిగినదంతయు చేశాము మాకు గూడ వాగనుసప్లయి రావాలనే ఉన్నది మాకేకాదు వ్యాపారస్తులకుకూడ వాగనుసప్లయివస్తే, వారికికూడ ఎక్కువలాభము సంపాదించు కోవాలనే ఉంటుంది

వాగనుల సప్లయి questıon కేంద్ర ప్రభుత్వమువారు తీర్చలేకపోతు న్నారు వారికేమి యిబ్బందులు ఉన్నాయోగాని వారితరపున నేను యిప్పుడు సమాధానము చెప్పలేకుండ ఉన్నాను

మిస్టర్ స్పీకర్ శ్రీరామమూర్తిగారు చెప్పినవిషయాలు మంత్రిగారు ఆలోచించి సహాయముచేస్తూఉంటారు

## PAPERS LAID ON THE TABLE OF THE HOUSE

### *Notıficatıons ıssued under Sectıon* 11 *(I) of the Madras Motor Vehıcles Taxatıons Act*, 1931

*Srı N Sanjeeva Reddi* Sır, I beg to lay on the Table, under sub sectıon (2) of Sectıon 11 of the Madras Motor Vehıcles Taxatıon Act, 1931 (Act III of 1931) a copy of each of the Notıficatıons ıssued under Sectıon 11 (1) of the Madras Motor Vehıcles Taxatıon Act, 1931 publıshed at page 64 ın part 1 of the Andhra Pradesh Gazette dated 11th July, 1957

*Mr Speaker* · Papers laıd on the Table of the House

## LEAVE OF ABSENCE TO SRI T JALAYYA, M L A

*Srı P Ranga Reddı* (*Gıddalur*) Sır I beg to move

"That under Rule 265 of the Assembly Rules, leave of absence be granted by thıs House to Srı T Jalayya, Member, Andhra Pradesh Legıslatıve Assembly for the present meetıng of the Assembly as he ıs on Contınental Tour"

*Mr Speaker* The Questıon ıs

"That under Rule 265 of the Assembly Rules, leave of absence be granted by thıs House to Srı T Jalayya, Member, Andhra Pradesh

Legislative Assembly for the present meeting of the Assembly as he is on Continental Tour "

The motion was adopted

## BUSINESS OF THE HOUSE

శ్రీ బి శంకరయ్య (బుచ్చిరెడ్డిపాలెం - జనరల్) అధ్యక్షా, ఇప్పుడు సభలో తెలుగుభాష వాడుచున్నారు కాని సవరణలు తెలుగులో యిస్తే తీసుకోము అని చెబుతున్నారు కాబట్టి మేముయిచ్చే సవరణలు తెలుగులో యిస్తే తీసుకోటానికి ఏర్పాటు చేయవలసిందిగా కోరుతున్నాను

మిస్టర్ స్పీకర్ అలాగే ఏర్పాటు చేస్తాను రూల్సుఅన్నీ మారడము వల్ల మీకు అన్ని అనుకూలములు చేకూరగలవు. తెలుగులో యివ్వటానికి ఆక్షేపణ ఏమీలేదు. తీసుకోము అని చెప్పటానికి వీలులేదు తెలుగులో యివ్వవచ్చును తీసుకోము అని చెప్పటానికి ఆఫీసుకు అధికారములేదు ఇచ్చినవాటికి ఆఫీసువారే తర్జుమాచేసి పంపుతారు. నేను ఆఫీసుకు యిచ్చిన instructions ఏమిటంటే, తెలుగులోగాని ఇంగ్లీషులోగాని యిస్తే, వాటికి కావలసిన తర్జుమా చేసి అందరికీ పంచిపెట్టమనే నేను ఆదేశించాను ఆ ప్రకారము చేయకపోతే, అది ఆఫీసుదే తప్పు ఏ తీర్మానాలు అయినా తెలుగులోగాని ఇంగ్లీషులోగాని యివ్వటానికి సభ్యులకందరికీ సంపూర్ణ అధికారము ఉన్నది అని మీకు అందరికి గట్టిగా చెబుతున్నాను

ఒక గౌరవ సభ్యుడు · ఇతర భాషలలో ఇవ్వవచ్చునా ?

మిస్టర్ స్పీకర్ : ఒక్క తెలుగులోను, ఇంగ్లీషులోను యివ్వవచ్చును ఇతర భాషలలోయిస్తే తీసుకోరు

ఒక గౌరవ సభ్యుడు : హిందీలో ఇవ్వవచ్చునా ?

మిస్టర్ స్పీకర్ : అది మధ్యప్రదేశ్‌లో జరుగుతున్నది. అక్కడ యివ్వవలసిందే గాని యిక్కడ కాదు.

## THE ANDHRA PRADESH APPROPRIATION BILL No. 3 OF 1957

*Mr Speaker:* I have to announce to the House that the following message dated the 1st November, 1957 has been received from the Governor of Andhra Pradesh :

"In pursuance of clause (1) of article 207 of the Constitution of India, I, Bhimsen Sachar, Governor of Andhra Pradesh, hereby

give my recommendation to the introduction in the Andhra Pradesh Legislative Assembly of the Andhra Pradesh Appropriation (No 3) Bill, 1957, and in pursuance of clause (3) of the said article, I also recommend to that Assembly, the consideration of the said Bill "

*The Minister for Finance (Dr B Gopala Reddi)* Mr Speaker, Sir

"I beg to introduce the Andhra Pradesh Appropriation Bill No 3, of 1957 and move that the Bill be taken into consideration at once "

ఈ బిల్లులోని విషయములను గురించి రెండు దినములు చర్చజరిగింది ఒకసారి general discussion మీద జరిగింది ఇంకొకసారి డిమాండ్లమీద రెండురోజులు పూర్తిగ చర్చించడము జరిగింది ఈ రెండుదినముల యొక్క చర్చఫలితముగా యీ Appropriation Bill తీసుకొని రాబడింది కాబట్టి యీ బిల్లుమీద ఎక్కువగ చర్చ కాకుండానే సభవారందరు ఆమోదించవలసిందిగ కోరుచున్నాను

*Mr Speaker* Motion moved

* శ్రీ బి. శ్రీరామమూర్తి అధ్యక్షా, ఈ దినము చాలా మట్టుకు ముఖ్యంగా పొదుపుఉద్యమమును గురించి ప్రచారము జరుగుచున్నది రాష్ట్రములో ప్రతి ప్రాంతములోను పనిపాట్లు చాలామటుకు ప్రారంభమైనవి నిజానికి యీ పొదుపుఉద్యమము యొక్క ఉద్దేశ్యము, సిద్ధాంతము కూడ మంచిదే దీనిలో ఏమాత్రము సందేహము లేదు కాని ప్రభుత్వము ముందు పొదుపుచేయడము ప్రారంభించిఉంటే, అటుతరువాత రెండవవారి వద్దకు వెళ్ళి పొదుపు చేయాలని కోరటానికి అవకాశము, అర్హత ఉంటుందిగాని, తానే ఏ మాత్రముకూడ economic measures ను అనుసరించకుండా, అవలంబించకుండా, ప్రభుత్వము ప్రజలవద్దకు పోయి "మీరు పొదుపుచేయండి పొదుపు చేసిన సొమ్మును ప్రభుత్వానికి అందజేయండి" అని చెప్పటానికి వారికి నైతికంగా సరైన పటుత్వం ఉంటుందని నేను నమ్మడములేదు నేను ఆ విధంగా భావించడములేదు నిజానికి పొదుపుచేయడము మంచిదే అయితే పొదుపుచేసే అవకాశములు ప్రజలకు ఎంతవరకు ఉన్నవి అనేది మనము ఆలోచించాలి. ప్రజలలో పేదవారు ఉన్నారు సామాన్య రైతాంగమునకు చెందిన ప్రజలు ఉన్నారు భాగ్యవంతులు ఉన్నారు ఈనాటిపరిస్థితులు ఒక్కసారి ప్రభుత్వము గమనించాల్సిన అవసరము ప్రభుత్వముదృష్టిలో పెట్టుకోవాలి. ధరలు పెరిగి ఉన్నవి. ప్రతి ప్రాంతములోను కరువు పరిస్థితులు కన్పిస్తున్నవి అధికధరలవల్ల పేదవారు సామాన్యప్రజలు తిండికి

చాలకుండ కష్టపడుతున్న రోజులివి వారికి అప్పులు, ప్రభుత్వము వేసిన పన్నుల భారము ఉంటున్నది ఈ పరిస్థితులలో యీ రెండుతరగతులవారు పొదుపు చేయగలిగినది ఏమైనా ఉన్నదా అనేది ప్రభుత్వముకూడ ఆలోచించాలి ఈ పొదుపుకు తగిన అవకాశములు లేనటువంటి సందర్భములో పేదవారివద్దనుంచి నిర్బంధముచేసి వసూలుచేస్తే ప్రభుత్వానికి ఆదాయము లభిస్తుందని అనుకోవడము పొరబాటు ఈ విధముగా కాకుండ యితరత్రా యీ సొమ్ము వసూలు చేయటానికి అవకాశములు లేవా అని అంటున్నాను అందువల్ల పన్ను అయినా సరే, యిలాంటి ఉద్యమముద్వారా ప్రభుత్వము ప్రతి మనిషివద్దను వసూలు చేయటానికి నిర్ణయించుకున్న పరిమితికంటె, తక్కువ లేకుండా అంతకు ఎక్కువ ఆదాయము వస్తున్న మనుష్యులవద్దనుంచి యిలాంటి సొమ్ముగాని, పన్నుగాని వసూలు చేయటానికి తలపెట్టినట్లయితే సముచితముగా ఉంటుంది ఎక్కువగ ఆదాయము వస్తున్నవారి వద్దనుంచి ఒక పద్ధతిన యింతవసూలు చేయాలి అని నిర్ణయించి, ప్రభుత్వాధికార్లకు ఆదేశించి వసూలు చేయడము మంచిది పేదవారు, సామాన్యప్రజలు అప్పులబాధతోను, పన్నులబాధతోను, తిండికి చాలకుండ యిబ్బందులు పడేసమయములో వారిని అప్పులనుంచి తప్పించటానికి ప్రభుత్వము వారికి డబ్బు సదుపాయములు చేయవలసిఉన్న సమయములో వారివద్దనుంచి యీ పొదుపు ఉద్యమముద్వారా డబ్బు వసూలుకు ఆలోచించే సమయముకాదు యిదివరకు ప్రభుత్వమువద్ద తీసుకున్న అప్పులే తీర్చలేకుండఉన్న పరిస్థితులలో వారు ఉన్నారని మనకు స్పష్టముగ తెలుస్తున్నది ఇంతవరకు వాళ్ళు అనేక రకాలుగా ప్రభుత్వమువద్ద అప్పులు తీసుకుని ఉన్నారన్న సంగతి ప్రభుత్వానికి తెలుసు ఆ పాత అప్పులు యీ September మాసము ఆఖరులోగా వారు యివ్వదేలిన బాకీలో నాల్గవవంతు కట్టినట్లయితె, మిగిలిన మూడు వంతులుకూడ వచ్చే డిసెంబరునెలలో యివ్వవచ్చునని ప్రభుత్వము ప్రకటించి యున్నారు. ఈ మొత్తము అయినను వాళ్ళు చెల్లించలేనటువంటి స్థితిలో ఉంటున్నారు ప్రత్యేకంగా తెలంగాణ ప్రాంతము తీసుకుంటే, ఇదివరకు వాళ్ళు జమకట్టినడబ్బు కొన్ని వాయిదాలమీద తీర్చవలసి యుంటుంది ఒక్కొక్క వాయిదాకు చెల్లించినడబ్బు తీసుకున్న ఋణముమీద కట్టవలసిన వడ్డీక్రింద జమకట్టుకోకుండ తప్పించినట్లయితే బాగా ఉండేది. దానివల్ల వడ్డీకి వడ్డీ తిరిగి చక్రవడ్డీ ప్రజలవద్దనుంచి వసూలుచేసే పరిస్థితి కన్పిస్తున్నది ఇంతే కాకుండ 1954వ సం. వరకు యివ్వవలసినవడ్డీ రద్దు చేస్తామని కూడ ప్రభుత్వము ప్రకటించియున్నది ఆ ప్రకటన హైదరాబాదు ప్రాంతములో చేసియున్నారు. ఆ ప్రకటనను యీనాటి ప్రభుత్వము పాటించడములేదు. ఇంతేకాదు. బాపులకు సంబంధించిన అప్పులు ఉంటే, అందులో నాల్గవవంతు రద్దు చేస్తామని కూడ ప్రభుత్వము చెప్పియున్నారు. కాని అదికూడ ప్రభుత్వము

అమలులో పెట్టడములేదు అందువల్ల ప్రజలు తాము తీసుకున్న ఋణములను చెల్లించలేకుండ ఉన్న యీ దుర్భర పరిస్థితులలో ప్రతివారికి డబ్బు చేతిలో లేకుండ ఉండే సమయంలోనే సరిగా యీ సెప్టెంబరు మాసములోనే జబర్దస్తీగా, జప్తుల ద్వారా ప్రభుత్వము వసూలుచేస్తున్నట్లుగా తెలుస్తున్నది ఇది తెలంగాణ ప్రాంతములో ఉన్న ప్రస్తుత పరిస్థితి ఇక పొదుపు ఉద్యమము విషయము చూద్దాము ప్రజలకు ప్రస్తుత పరిస్థితి ఎట్లా ఉన్నదంటే, తాము తీసుకున్న ఋణమును తీర్చలేని స్థితిలో ఉన్నారు సామాన్యముగ జీవితము గడుపుకుంటున్న పేద రైతాంగము, కార్మికులు ఎక్కువగ బాధపడు తున్నారు కార్మికులకు స్వేచ్ఛగాని, అధికారాలుగాని ప్రభుత్వములో చట్టము ద్వారా సంక్రమించడములేదు దీనికి కారణము, కార్మిక విధానము ఎట్లా ఉన్నదో చూడండి మాచ్ ఖండులో యిదివరకే ప్రభుత్వము ఆలోచించవలసి నటువంటి విషయము అది అక్కడ అయిదారువేల మందికిపైగా కార్మికులకు వృత్తి ఉపాధులు పోయాయి వారికి సరియైన ఉద్యోగాలు లేవు వారికి రక్షణలేకుండా పోయింది అక్కడపనిచేసేవారిని retrench చేసి, బర్తరఫుచేసి పంపి వేశారు ఈ ఆరువేలమందినీ గూడ లారీలలో బలవంతముగా, నిర్బంధముగా, జబర్దస్తీగా పంపి వేసినట్లు తెలుస్తున్నది. అక్కడ ప్రస్తుతము ఉన్న పరిస్థితి యిది అక్కడవారందరు కష్టపడిపనిచేసి, అడవులుకొట్టి, కొండలు తొలచి, ఆప్రాంతము నివాస యోగ్యముగా చేశారు ఆ విధముగ కష్టపడి పనిచేసినవారిని యీనాడు అక్కడి నుంచి జబర్దస్తీగా పంపివేయడము దురన్యాయమని అంటున్నాను ఆ ఆరువేల మంది కూడ ప్రభుత్వము యొక్క Semi-Government Establishment లో చేర్చుకోవాలని కొత్తగా ఆందోళనచేయడం కూడ జరిగింది ఆ రోజు లలో ముఖ్యమంత్రిగారు వాళ్లకు హామీకూడ యిచ్చి ఉన్నారు ఏమని అంటే, మీకు తప్పకుండ సానుభూతితో సహాయము చేస్తాము అని అన్నారు అది జరిగి యిప్పటికి ఒక సంవత్సరము దాటిపోయింది కాని వారి తాలూకు పరిస్థితులను గురించి ప్రభుత్వము యింతవరకు ఆలోచించినట్లు లేదు వారందరు ఒక దినము ఊరేగింపుతో ముఖ్యమంత్రిగారి బంగళాకు వచ్చి గోలపెట్టి మొత్తు కున్నారు

డాక్టరు బి. గోపాలరెడ్డి ఈనాటి Appropriation బిల్లు సందర్భములో కార్మికుల సమస్యలు, వగైరాలు అన్నీ తెచ్చి, మాట్లాడటము ప్రారంభిస్తే, యిక మనకు ఉన్న టైముఅంతా అయిపోతుంది. కాబట్టి యీ బిల్లును గురించి మాట్లాడితే బాగా ఉంటుంది

శ్రీ బి. శ్రీరామమూర్తి ఈ బిల్లులో Electricity ని గురించి ఉన్నది మాచ్ ఖండ్ Electricity విషయమును గురించి, దానికి సంబంధించిన

కార్మికుల విషయము కూడ అవసరము గనుక మాట్లాడవలసివచ్చింది కాబట్టి అక్కడి కార్మికులను గురించి మాట్లాడడము సహజము కదా! దానికి జవాబు మంత్రిగారు ఏమి చెప్పబోయేది కూడ నాకు తెలుస్తుంది అంతవరకే

శ్రీ యన్ సంజీవరెడ్డి : సరే కార్మికులవిషయములు ఎన్నో ఉంటున్నవి ఇక కార్మికులు అంటే, వారి జీతాలు, భోజనము, food problem, వగైరాలు అన్నీ ఒకదానికిఒకటి link చేస్తూ పోతూంటే ఎట్లా? అలాగైతే ప్రతి subject గూడ human beings కు సంబంధించినదే అలాంటివి ఎన్నో ఉన్నవి ఇప్పుడు అవి అన్నింటినిగురించి మాట్లాడడముఅంటే టైము వుండదు.

మిస్టర్ స్పీకర్ మీకు allot చేసింది పది నిమిషములే. అవసర విషయములనే చెప్పితే బాగుంటుంది

శ్రీ బి. శ్రీరామమూర్తి అక్కడ కష్టపడిపనిచేస్తున్న కార్మికులకు కలిగిన కష్టములనుగురించి ముఖ్యమంత్రిగారికి మనవిచేయగా వారుయిచ్చినజవాబును గురించి మనవిచేస్తున్నాను అందువల్లనే ఆ ఉదాహరణ యిప్పుడు మీదృష్టికి తేవలసివచ్చింది ఆ కార్మికులందరు ఆరోజున ముఖ్యమంత్రిగారివద్దకు పోయి నప్పుడు వారు అన్నారట ఏమనిఅంటే, "ఎవరిఅత్తగారిసొమ్ము యిది? ఎవరి సొమ్ములోనుంచి యిస్తారనుకుంటున్నారు?" అని అన్నారట ఈ విషయము మీదృష్టికి తెస్తున్నాను.

అలా కాకుండా కార్మికుల యందు సానుభూతిపూర్వకముగా జవాబుచెప్పియుంటే మంచిదని నాఅభిప్రాయము వారియొక్క యిబ్బందులు, కష్టములు ఏమాత్రము గమనించకుండా, ఏమాత్రము సానుభూతిచూపకుండా ప్రభుత్వము ఉంటున్న పరిస్థితులలో, యిక సామాన్య ప్రజలయొక్క పేదవాళ్ళ యొక్క సమస్యలు ఏవిధముగ ప్రభుత్వము పరిష్కారము చేయగలదు అని అడుగుతున్నాను. ఒకానొకప్పుడు శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారి మంత్రి వర్గములో, ఆనాడు ఇద్దరితో ఒక కమిటీవేసి, కార్మికుల జీతభత్యముల విషయము విచారించి సూచనలు చేయమని అన్నారు. తరువాత వారు ఏమి నిర్ణయముచేశారో, తెలియదు. అసలు ఆకమిటీ రిపోర్టు publish అయినదా? అది అమలుజరిపేపద్ధతి ప్రభుత్వానికి ఉన్నదా? ఆవిషయములో తుదినిర్ణయము ఏమిఅయిందిన్నీ కూడ తెలియలేదు. అదేవిధముగ ఈ మధ్య ప్రభుత్వము నూరు రూపాయలలోపు జీతాలు పుచ్చుకునేవారికి ఆరురూపాయలు allowance యిస్తామని ప్రభుత్వము ప్రకటించింది. అది కొందరికి అన్వయింపచేయలేదు. ఒకసారి apply చేసినతరువాత, యిచ్చినసొమ్మును మరల recover చేస్తామని

చెబుతున్నట్లు, కొన్నిచోట్ల బలవంతముగ వసూలు చేస్తున్నట్లు తెలుస్తున్నది దీనివిషయము ఆలోచించమని కోరగా, ఆలోచిస్తామనిమాత్రము అన్నారు అంతవరకైనా అన్నారు సంతోషమే ఉస్మానియా యూనివర్సిటీ, ఆంధ్ర యూనివర్సిటీ, వెంకటేశ్వర యూనివర్సిటీ, యీ మూడుకూడ autonomous bodies అని తెలుసు అందులోఉన్న కార్మికులకు యీ ఆరు రూపాయల allowance యిస్తున్నారు ఆదృష్టితోనే ఈ allowance కార్మికవర్గమునకంత టికినీ అన్వయింపజేసి యివ్వాలని కోరుతున్నాను దీన్నిగురించి ఆలోచించి చేస్తామని చెప్పటానికి ప్రభుత్వమునకు అవకాశము ఉన్నది ఇక్కడ సికింద్రాబాదు, హైదరాబాదుకు చెందిన Municipal Corporations ఉన్నవి అవికూడ autonomous bodies కదా ! వాళ్ళక్రింద పనిచేసే కార్మికులకుకూడ జీతాలు పెంచారు వాళ్ళజీతాలు పెంచటానికి యీ కార్పొరేషన్సుకు హక్కుఉన్నదా ? కనీసము యీ సమస్యను ట్రిబ్యూనల్ ఎదుటకు ప్రభుత్వము ఎందుకుపంపించ కూడదు ? అట్లా పంపించకుండ ప్రభుత్వము నిరాకరిస్తున్న సందర్భము ఉన్నది దీన్నిగురించి ప్రభుత్వము ఆలోచించవలసియున్నది ఈసందర్భములో కార్మికుల తాలూకు స్వేచ్ఛకు భంగముకలిగించడము మంచిదికాదు మనదేశములో అసలు స్వతంత్రానికి భంగముకలిగేపరిస్థితి ఏర్పడుతుందని మనవిచేస్తున్నాను తరువాత సాహిత్య academy ని గురించి యిదివరకే చర్చకువచ్చింది ఇది ఏర్పాటుచేయడము మంచిదే అందుకు సంతోషము వెలిబుచ్చుతున్నాను అందులో తప్పేమిలేదు కాని అనేకరకాలుగా ఉన్న nation తాలూకు mines అన్నీ centralise చేయటానికి కావలసిన అవకాశములు ప్రభుత్వము యొక్క చేతులలోనే ఉన్నవి ఇదే నాకు యీనాడుఉన్న భయము సాహిత్య ఎకాడమీ ఏర్పాటుచేయడము మంచిదే అవసరముకూడ. దానిని గురించి ఆలోచించేటప్పుడు అందులో ఎవరెవరు ఉండాలి, ఎంతకాలము ఉండాలి అనేవిషయమును గురించి ప్రభుత్వమే నిర్ణయముచేస్తుందని ఆశిస్తున్నాను

ఇదివరకెప్పుడైనా కవులుగాని, రచయితలు గాని, గాయకులు గాని, ప్రభుత్వం జరిపిన అన్యాయాలను బయటపెడుతూ వ్రాసిన గేయం లేక గీతం కనబడేది ఈ రోజు ఎవరూ మాట్లాడరు All India Radio కానివ్వండి, సాహిత్య అకాడమీ కానివ్వండి, ప్రభుత్వం యిచ్చే పారితోషికాలకై ఆశపడి జంకుతున్నారు ముందుకు రాలేకపోతున్నారు. ఇదీ వున్న పరిస్థితి. అందుచేత జాతియొక్క మేధస్సుమీద control చేయడానికి ప్రభుత్వానికవకాశా లున్నప్పుడు వారు జాగ్రత్తగా ప్రయత్నం చేయాలి న్యాయమైన పద్ధతిలో పోవలసి వుంటుందని మనవి చేస్తున్నాను

*Mr Speaker* The question is

"That the Andhra Pradesh Appropriation (No 3) Bill, 1957 be taken into consideration at once "

The motion was adopted

*Clause* 2

*Mr Speaker* The question is :

"That Clause 2 stand part of the Bill"

The motion was adopted

Clause 2 was added to the Bill

*Schedule*

*Mr Speaker* The question is

"That the Schedule stand part of the Bill"

The motion was adopted

The Schedule was added to the Bill.

*Short Title*

*Mr Speaker* · The question is

"That the Short Title stand part of the Bill"

The motion was adopted.

The Short Title was added to the Bill

*Preamble*

*Mr Speaker* . The question is .

"That the Preamble stand part of the Bill"

The motion was adopted

The Preamble was added to the Bill

**Dr. B. Gopala Reddi* I beg to move :

"That the Andhra Pradesh Appropriation (No. 3) Bill, 1957 be passed into Law"

ఇప్పుడు శ్రీ శ్రీరామమూర్తిగారు రెండు points చెప్పినారు. ప్రభుత్వం వారు పొదుపు చేసుకోకుండా యితరులు పొదుపు చేసుకోవాలని కోరుతున్నారు అది న్యాయం కాదన్నారు. ప్రభుత్వానికి పన్నులు వేసే అధికారం ఉన్నది, ప్రజలకు లేదు. కాబట్టి ప్రజలు పొదుపు చేసుకోవడం చాలా అవసరం. ప్రభుత్వంవారు పొదుపు చేసుకోలేకపోయినా ఏదో రకంగా సమాళించు

కోవచ్చును పన్నులు వేసుకోవచ్చు కాబట్టి ప్రభుత్వం పొదుపు చేసుకోలేక పోయినా ప్రజలయినా పొదుపు చేసుకోవడం చాలా అవసరమని అంటున్నాను "అప్పులే చెల్లించుకోలేకుండా ఉన్నారు వీరందరిదగ్గరకు పోయి నిర్బంధం చేస్తున్నారు" అన్నది రెండవ అంశం అసలు ప్రభుత్వానికి అప్పు యివ్వవలసి నటువంటివారు 1% కూడా లేరు వాళ్లదగ్గరకు పోయి అప్పులు వసూలు చేయండి, National Savings Certificate, కొనించండి అనే ఉద్దేశ్యం కాదు అసలు అప్పు యివ్వగలిగినవాళ్లు 1% కూడా లేరు కొదమ 99% దగ్గరకు పోవచ్చుననే ఉద్దేశ్యంతో యిది జరిగింది ఇది వారు చెప్పినదానికి సమాధానం.

*Mr Speaker* Motion moved

శ్రీ వి విశ్వేశ్వరరావు (మైలవరం) అధ్యక్షా, దీనిని చట్టం చేయబోయే ముందు మంత్రిగారి దృష్టికి కొన్ని విషయాలు తీసుకురావలసిన అవసరంవుందని భావిస్తున్నాను ఎందువల్లనంటే, మిత్రుడు శ్రీ శ్రీరామమూర్తిగారు చెప్పి నట్లు ప్రభుత్వం కార్మికుల యెడల సరైన దృక్పథంతో ఆలోచించడంలేదు ప్రత్యేకంగా కార్మికుల కోర్కెలప్రసక్తి వచ్చినప్పుడు వాటిని అనేక సందర్భా లలో చర్చించికూడా, "ఆచరణలో పెడతాం" అని వాగ్దానం చేసికూడా, ఆచరణలోకి తీసుకురావడానికి కొన్ని నెలలు పడుతున్నది నెలలు పట్టినప్పటికీ, వానిని సకాలంలో పరిష్కారం చేయడంలేదు అని మనవి చేయవలసిన అవసరం ఏర్పడింది Highway Employees Union కు అసంతృప్తి చాల రోజులుగావుంది. రోడ్ల స్థితిని గురించి చాలా సందర్భాలలో చెప్పాము జిల్లాబోర్డులు నిర్మించే రోడ్లు చాలా అధ్వానంగా వున్నాయి కనుక వాటిని రాష్ట్రప్రభుత్వమే తీసు కుని maintain చేయటానికి ఈ సప్లిమెంటరీ గ్రాంట్ల సందర్భంలో ప్రతిపాదించ బడింది రోడ్లను గురించి శ్రద్ధతీసుకున్న విధముగానే రోడ్లమీద పనిచేసే కార్మి కుల స్థితి ఎలా వుందని ప్రభుత్వం ఆలోచించినదా ? అనే సందేహం ఏర్పడు తుంది. కారణం యేమిటంటే అనేక సందర్భాలలో యీ విషయం ప్రభుత్వ దృష్టికి తీసుకురావడం జరిగింది. లేవిలవారిగా కూడా చెప్పగలను ఒక సంవత్స రంలో మంత్రిగారికి కనీసం పది పర్యాయాలయినా memoranda ఇవ్వడమో, reminders వ్రాయడమో, వారితో మాట్లాడడమో జరిగింది ఒకటి రెండు సార్లు Chief Engineer, Highways అసమావేశాలలో పాల్గొనడం కూడా జరిగింది కాని ఈ కోర్కెలు యింతవరకూ పరిష్కారం కాలేదు అలాగే ఉండిపోయాయి ఎందువల్ల ? ప్రత్యేకించి హైదరాబాదులో రోడ్డు కూలీలు చాలా సంవత్సరాలుగా ఆందోళన చేస్తూ వచ్చారు వారి సమస్యలు కొన్ని వున్నాయి. వాటిని ప్రభుత్వదృష్టికి తీసుకువచ్చారు. ప్రధానమైనటువంటిది Dearness allowance అనేది ఇదవరకే ప్రభుత్వపు Tribunals తీర్పులుకూడా

చెప్పాయి Highways Department లోని employees కి హైదరాబాదు ప్రభుత్వం యిచ్చినటువంటి Gratuity allowances యివ్వాలి Dearness allowance కూడా యివ్వాలని చెప్పారు ఆరు రూపాయలు యిక్కడ కొంత మందికార్మికులకు యిచ్చారు నిజామాబాదు నల్లగొండ జిల్లాలలో కొంతమంది కార్మికులకు 6 రూపాయలు యిచ్చారు మూడు నెలలు యిచ్చినతరువాత తిరిగి యీనాడు ఆ ఆరు రూపాయలను వసూలు చేయడానికి ప్రభుత్వం పూనుకుంది ఆపి వేయడం, యిచ్చింది మళ్ళీ వసూలుచేయడం చాలా అన్యాయం ఈ విషయం చర్చించాము గతంలో యిచ్చినది తిరిగి వసూలుచేయకుండా వుండాలని ప్రభుత్వం దృష్టికి తీసుకువస్తున్నాను నిన్న ప్రశ్నల సందర్భంలో కూడా అడిగాము లోగడ యిచ్చింది వసూలు చేయము అని, లోగడ యిచ్చింది వసూలు చేయడాన్ని మానివేయాలని మంత్రిగారి దృష్టికి మరల తీసుకువస్తున్నాను అదేవిధంగా boy cooly ల సమస్య వుంది పూర్వం రోడ్లమీద పనిచేయడానికి 15 సంవత్సరాలకు లోపువయస్సుగల కుర్రవాళ్ళను ప్రభుత్వం నియమించింది రెండు సంవత్సరాల క్రితం ఆ పద్ధతి మానేశారు 15 సంవత్సరాలు గడచినప్పటికీ యింకా boy కూలీలనే పేరుతో జీతాలిస్తున్నారు వారికి 40 సంవత్సరాలు వయస్సు వచ్చినా boy cooly ల జీతాలే ఇస్తున్నారు System మారినప్పటికీ పాత system క్రింద వున్న జీతాలే యిస్తున్నారు ఎప్పుడయితే system మారిందో దానితోపాటు వేతనాలు కూడా మారవలసిన అవసరం వుంది. కాని వారికి Gratuity allowance, Subsistance allowance లు యివ్వడంలేదు ఎందువల్ల యివ్వడంలేదు ? అనేది ఆలోచించాల్సిన అవసరం వున్నది. ప్రభుత్వం అనేక సందర్భాలలో ''పొదుపు, పొదుపు'' అని చెబుతున్నది ఈ పొదుపు అనేది కూలీలకు జీతాలు యివ్వడంలోనే పొదుపు చేస్తున్నదేమోనని ఆలోచించాల్సిన అవసరం వస్తున్నది. పొదుపు చేయవలసిన చోట చేయడంలేదు కార్మికులకు న్యాయంగా యివ్వవలసిన వేతనాల విషయం వచ్చినప్పుడు మాత్రమే పొదుపు చేస్తున్నారా అని సందేహించవలసిన అవసరం యేర్పడింది ఎండలో వానలో పనిచేసి Highways కూలీలు చాలా బాధపడుతున్నారు వారి కష్టాలు ప్రభుత్వ దృష్టికి పదేపదే తీసుకురావడం జరిగింది అయినప్పటికీ పరిశీలన చేయకపోవడం న్యాయంకాదని వాటిని వెంటనే పరిష్కరించవలసినదనీ ప్రభుత్వాన్ని కోరుతున్నాను. కార్మిక ఆఫీసర్లు దీనిని పరిశీలించినతరువాత చెప్పిన సమాధానం యేమిటంటే, "Conciliation కు గాని Labour Tribunals కు గాని Highways Department రావడంలేదు మమ్మల్ని నేమి చేయమన్నారు ? మేము యేమీ చేయలేకపోతున్నాము" అంటున్నారు. అనేక కేసులలో డ్రైవర్లకు జీతాలు యివ్వకపోవడం Repair yards లో వున్నటువంటి కార్మికుల జీతాలు సరిగా

యివ్వకపోవడం జరుగుతున్నది కొంతమందికి వున్నటువంటి scales ప్రకారమైనా జీతాలు పెరుగుదల కావడంలేదు కార్మికసంఘానికి తెలియపరచినప్పుడు కార్మిక అధికార్లు చెప్పేది యేమిటంటే " Highways Department వారు ఎప్పుడూకూడా conciliation లో పాల్గొనడంలేదు Tribunals లో పాల్గొనడంలేదు అందువల్ల మేము యేమీ చేయలేకపోతున్నాం "అని అది కూడా సరైనది కాదు బయట కార్మికులకు ఏ చట్టాలయితే వర్తిస్తున్నాయో ఆ చట్టాలే Highways శాఖలోని కార్మికులకు కూడా వర్తించాలనీ, అందుకు తగిన చర్య తీసుకున్నప్పుడే కార్మికులకు న్యాయం జరుగుతుందని ప్రభుత్వం దృష్టికి తీసుకు వస్తున్నాను ఈ విషయంలో నేను 10 సార్లు చెప్పాను 24-3-57 వ తారీఖున ఒక memorandum యిచ్చి కార్మిక సంఘ ప్రతినిధులు మంత్రిగారితో మాట్లాడారు వెంటనే చేస్తాం అని మంత్రిగారు చెప్పారు అందులో కొన్ని విషయాలు అంగీకరించారు తొమ్మిది మాసాలయినా ఆలోచించలేదు అదే విధంగా 15-5-57 వ తారీఖున మంత్రిగారి దృష్టికి తీసుకువచ్చారు ఈ విధంగా అనేక పర్యాయాలు తీసుకువచ్చి విసిగి, "ఇంతే ఇంక చేసేదిలేదు ప్రభుత్వానికి మన కోర్కెలను నివేదించినా పరిష్కారం యింకా చేయలేదు" అని తీవ్రమయిన అసంతృప్తితో వున్నారు కాబట్టి వెంటనే సత్వర చర్యలు తీసుకుని న్యాయం కలుగజేయాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను

డా బి. గోపాలరెడ్డి గౌరవసభ్యులు చెప్పినటువంటి విషయాలన్నిటినీ సక్రమంగా ఆలోచిస్తాం

*Mr Speaker* The question is

" That the Andhra Pradesh Appropriation (No. 3) Bill, 1957 be passed into Law "

The motion was adopted

మిస్టర్ స్పీకర్ ఎప్రోప్రియేషన్ బిల్లు మంజూరు అయినది. ఇప్పుడు మీఎదుట రెండుబిల్లులు వున్నవి ఒకటి మదరాసు ఎస్టేట్సు లాండు (ఆంధ్ర ప్రదేశ్ ఎమెండుమెంటు) బిల్లు, రెండవది The Andhra Land Revenue (Additional Wet Assessment) (Andhra Pradesh Amendment) Bill, 1957 ఇప్పుడు Wet Assessment Bill తీసికొందామా ! ఇది సెలక్టు కమిటీకి వెళ్ళవలసి యున్నది కనుక ముందుతీసికొందాము 20 వ తేదీ సాయంత్రంనుంచి ఈ ఎసెంబ్లీ సమావేశాలను వాయిదా వేయవచ్చును అందుచేత సెలక్టుకమిటీకిపంపే మూడు బిల్లులను ముందు సెలక్టుకమిటీకి పంపితే అవి త్వరగా తిరిగి సభ ముందుకు రావటానికి వీలువుంటుంది

శ్రీ పి. సుందరయ్య ఎస్టేట్సు అబాలిషన్ బిల్లును సెలక్టు కమిటీకి పంపరా ?

శ్రీ కె వెంకటరావు గవర్నమెంటువారికి ఈ బిల్లును సెలెక్టుకమిటీకి పంపటానికి అంగీకారంలేదండి

శ్రీ పి సుందరయ్య మూడు బిల్లులు సెలక్టుకమిటీకి పోవలసివున్నది Food situation పైన Rules Committee report పైనగూడ చర్చ జరుగవలసి వున్నది. ఈ బిల్లును సెలెక్టుకమిటీకి పంపటానికి మంత్రివర్గం తయారుగా లేనప్పుడు ఇప్పుడే దానిని చర్చించి, తరువాత సెలక్టుకమిటీకిపోయే బిల్లులను తీసికోవటము మంచిది ఈ ఎస్టేటులాండుల బిల్లు చాలా ముఖ్యమైనది

మిస్టర్ స్పీకర్ ఈ నాలుగురోజులలో వచ్చేవి, పోయేవి ఈనామలు ఎవీలేవు కదా ?

శ్రీ కె. వెంకటరావు అధ్యక్షా! ఈ drafting amendment ను Abolition Bill లో pass చేశారు మరల 3 (ii) (d) లో వున్న సర్వస్వరూపాలు ఈవేళ ఇచ్చిన amendments లో వున్నాయి ఈ సందర్భంలో ఏదైనా అవసరము వుంటే ఆలోచించుకోవచ్చు

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు List of Bills ఇచ్చారు ఇప్పుడు taxation measures తీసుకొంటే, యికచర్చలేకుండానే Select Committee కి పంపటం జరుగుతుంది ఇక్కడ సభ్యుల అభిప్రాయములు తెలుసుకొన్న తరువాత Select Committee కి వెడితే అక్కడి సభ్యులకు ఉపయోగంగా వుంటుంది.

మిస్టర్ స్పీకర్ . ఇదివరకు చెప్పినవి మరలచెప్పకుండా వుంటే నాకు అభ్యంతరములేదు. 12 గంటలలోపల ఈనాం బిల్లు పూర్తి చేద్దాం.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య · మిగిలిన ఒకగంటలోనే Assessment Bill పై చర్చపూర్తిచేస్తారా ? లేక రేపుకూడా చర్చవుంటుందా ?

మిస్టర్ స్పీకర్ : రేపు ఒకగంట తీసికొందాము.

## THE MADRAS ESTATES LAND (ANDHRA PRADESH AMENDMENT) BILL, 1957

*Sri K Venkata Rao* I beg to introduce the Madras Estates Land (Andhra Pradesh Amendment) Bill, 1957 and move that the Bill be taken into consideration.

*Mr Speaker* Motion moved

*శ్రీ కె వెంకటరావు అధ్యక్షా! ఈ బిల్లును గురించి నేను ఉపన్యాసము చెప్పవలసిన ఆవశ్యకత లేదు. అన్ని విషయాలు మొన్న జరిగిన రెండు బిల్లుల సందర్భములో నే మనవిచేశాను కర్నూలులో pass చేసిన amendmentలో explanation 2 లో "in such an inam village" అనేచోట ఒక drafting amendment అవసరమని భావించి ఈ బిల్లును తీసుకురావటం జరిగింది ఇంత వరకు చేసిన లెజిస్లేషన్‌లోని కార్యక్రమాలలో ఎక్కడైనా లోపంవస్తే ముందు ఆలోచించుకోవచ్చు ఇప్పుడు Section 3, Clause (3) (ii) (d) కి further amendment అవసరము లేదని ప్రభుత్వము యొక్క అభిప్రాయము. Wholesale గా 1908 నుండి 1957 వరకు Section 3 (ii) )d) కి ఇవాళ amendments పెట్టవలసిన అవసరం లేదని ప్రభుత్వ అభిప్రాయము ఏదైనా ఒక Section ను touch చేస్తే amendments ను move చేయవచ్చునని మీరు రూలింగ్ ఇచ్చారు. దానికి నేను బద్ధుడనై యున్నాను Estates Abolition Bill లో Clause ను in same wording లో pass చేశాము ఇది మారిస్తే మళ్ళి అది మార్చాలి అదిమారిస్తే 1908 ది మార్చాలి, 1948 ది మార్చాలి. ఇవన్ని చాలా క్లిష్టమైన విషయాలు. ఈనాం గ్రామం కాని, హామ్‌లెట్ కాని, కంద్రిక కాని, named village అయినా, unnamed village అయినా ఇదివరకు శాస్త్రములో ఎలావుందో, దానికి సంబంధించి తిరిగి abolish చేసేటప్పుడు such village అని ఉపయోగించటముతో interpretation లో తేడా వచ్చింది కనుక అవన్నీ పట్టా పొందివుండి, section 3 (ii) (d) ని satisfy చేస్తే అవి కూడా ఎస్టేట్లుగా చేర్చాలని ఉద్దేశ్యము. నూతన definition క్రింద ఏ హామ్‌లెట్‌ను, కంద్రిగను, ఈనాం గ్రామమును abolition క్రిందకు తీసుకువచ్చే ఉద్దేశ్యం ప్రభుత్వానికి లేదు such అనేమాటలో interpretation కొంచెము తేడావచ్చింది. గనుక దీనికి సంబంధించి ఈ బిల్లు వచ్చింది Section 3 (ii) (d) ని యింకా ప్రపంచానికి అంతా అన్వయించేటట్లు, పరిమితంగా అన్వయించేటట్లు చేయాలంటే అది వేరే ఆలోచించవలసిన విషయం. అది ఇప్పుడు అవసరం లేద నేది ప్రభుత్వము యొక్క అభిప్రాయమని మనవి చేస్తున్నాను

మిస్టర్ స్పీకర్ అయితే నేను ఒక రూలింగ్ యిస్తున్నాను. ఇదివరకు discuss చేయబడి pass అయిన matter మీద యిప్పుడు మళ్ళా discussion కు allow చేయను ఏమైనా క్రొత్త విషయాలు చెబుతేనే allow చేస్తాను. ఇప్పుడున్న ముఖ్యమైన మొదటి సవరణ "Be referred to the Select Committee" అనేది.

శ్రీ జి యల్లమందారెడ్డి (కనిగిరి) ఈబిల్లులో మొన్న మనం చర్చించిన విషయాలు చాలా ఉన్నాయి అప్పుడు వాటికి మంత్రిగారు సమాధానం యిస్తూ ఈ సవరణ purview లోకి రావాలని చెప్పారు

మిస్టర్ స్పీకర్ "Be referred to the Select Committee" అనే మొదటి amendment ను move చేస్తున్నారా ?

శ్రీ జి యల్లమందారెడ్డి Select Committee కి పంపమని move చేయడంలేదు ఆనాడు మంత్రిగారు శలవిచ్చినట్లుగా 3 (ii) (d) explanation లో వచ్చిన సవరణలకు సంబంధించి యిచ్చిన explanation లో మనం అనుకున్న ఉద్దేశాలు సరిగా అమలు జరుగుతున్నాయా, లేదా అనేది తమకు మనవిచేయాలనే ఉద్దేశంతోనే ఈ సవరణలు ప్రతిపాదించడమైనది అందువల్ల వేరే కొత్త విషయాలు లేకుండా మనం 1956 సం లో pass చేసిన సవరణ చట్టంవరకూ, నిన్న మనం ఆమోదించిన సవరణ ప్రకారం అనేక సందర్భాలలో మనం అనుకున్న ఉద్దేశాలు సక్రమంగా జరగడం లేదని, లెజిస్లేచర్ పాస్ చేసిన చట్టానికి వ్యతిరేకంగా తీర్పులు వస్తున్నాయని మనవి చేస్తున్నాను 'Named village' అనే సమస్య ఉన్నది మనం 'named village' క్రింద వస్తాయనుకొన్న గ్రామాలు 'named village' క్రిందరావు అని అనేక సందర్భాలలో తీర్పులు వచ్చాయి. ఫలాన చల్లాయిపాలెం ఈనాంగ్రామం, నిడుమూరు ఈనాం గ్రామం అని వుంటేనే తప్ప లేకపోతే 'named village' క్రిందకు రావని అనేక judgements ఉన్నాయి దీనికిసంబంధించి ఒకటి, రెండు విషయాలు తమ దృష్టికి తీసుకు రావాలనుకుంటున్నాను ఫలాన విషయంలో మనం అనుకున్నట్లుగా జరగడం లేదని మంత్రిగారికి చెబితే, అవి రావడానికి వీలులేదనో, వస్తున్నాయనో, అవన్నీ notify చేస్తున్నామనో, రద్దు అవుతాయనో సమాధానం యిస్తున్నారు. దానివల్ల వచ్చే యిబ్బందివల్ల అనేక సందర్భాలలో మనం అనుకొన్న ఈనాం గ్రామాలు 'estates' గా రావడంలేదని తమకు మనవిచేస్తూ ఈ named, village కి సంబంధించి కొన్ని విషయాలు మనవి చేస్తున్నాను

మనం 'named village' అని వుంచడం మూలంగా మనం అనుకున్న చాలా ఈనాం గ్రామాలు ఎక్కువ భాగం ఈనాముగా ఉన్నప్పటికీ కూడ "named" అనే విషయం సక్రమంగా లేదని, సక్రమంగా నియామకం లేదని, అందువల్ల ఈనాం ఎస్టేటులు కాదని చాలా జడ్జిమెంటులువున్నాయి. అందులో ఒకటి తమ దృష్టికి తెస్తున్నాను. 1954 వ సంవత్సరం M. L. J. (ii) క్రింద నిడుమూరు అనే గ్రామం విషయము 'నిడుమూరు ఈనాం' అని అందులో

ప్రాయకపోవడం మూలంగా అది ఈనాం ఎస్టేటు కాదని తీర్పు వచ్చింది అది మీ దృష్టికి తెస్తున్నాను,

"It seems to us highly doubtful whether the description of Nedumaram as a Dharmasanam village can be treated as a grant of a named village when we find from the two other Inam Fair Register extracts relating to Tirupattur temple and the Pillayarpatti temple that there the village was described simply as Nedumaram and not as Dharmasanam Nedumaram Those inams were not treated as part of Dharmasanam Nedumaram villages They were treated as part of Nedumaram village, which implies that the 'Dharmasanam Nedumaram' is intended to indicate that portion of the village which was granted to the Brahmans by the same grantor, the Pandya King in 32 and odd pangus The other two pangus were granted to the Tirupattur Devasthanam." అని ఉన్నది

ఇది ధర్మాసనం ఈనాం అని రిజిష్టరు కాలేదు, prove కాలేదు కాబట్టి యిది ఈనాం ఎస్టేటు కాదని తీర్పు చెప్పబడింది అందువల్ల మనం అనుకొన్న ఉద్దేశాల ప్రకారం యిది రాలేదని మనవిచేస్తున్నాను చల్లాయిపాలెం గ్రామం విషయమై నేనుమనవిచేసినప్పుడు ఆజడ్జిమెంటు తీసుకురమ్మని మంత్రిగారుచాలా సందర్భాలలో చెప్పారు చల్లాయిపాలెం గ్రామం విషయంలో కూడా heading లో చల్లాయిపాలెం ఈనాం అని ఉన్నప్పటికీ కూడా దానికి ప్రాముఖ్యత యివ్వకుండా అందులోని contents లో 'ఈనాం చల్లాయిపాలెం, శ్రోత్రియం చల్లాయిపాలెం' అని లేదు కాబట్టి అది ఈనాం ఎస్టేటుగా రావడానికి వీలులేదని జడ్జిమెంటు చెప్పబడింది

"It is usual in cases where the grant is of a named village in the sense that the grant did not comprise the entire area of the village but consisted of the major part of the area of the village excluding the minor inams that existed on the date of the grant, to find in columns 4 and 5 the entire gudikat being mentioned and the inams shown as deductions, as the excluded inams are usually dealt with separately in inam proceedings and title deeds are granted separately also

The learned Subordinate Judge was carried away by the fact that the village of Chellayapalem was treated as one unit in Revenue accounts The test is not whether, what was granted was treated as a village for the purpose of revenue, but whether, what was granted was a whole village or a named village The crucial question to determine is, whether under the grant what was granted was a village or a named village and not the subsequent treatment of it in the

revenue accounts Emphasis was laid by the learned counsel on the fact that the heading of the register contained the expression 'the village of Chellayapalem Shrotriam in the taluk of Nellore' Too much importance cannot be attached to the heading which is contained in the printed register of inams, but even there it does not say 'Shrotriam Chellayapalem', but it says shrotriam in the village of Chellayapalem because it is an inam in the village of Chellayapalem Shrotriam " అవి ఉన్నది

అందువల్ల దాంట్లో చల్లాయిపాలెం శ్రోత్రియం విశేజి అని లేదు కాబట్టి, చల్లాయిపాలెం గ్రామంలో శ్రోత్రియం అని ఉన్నది కాబట్టి అది ఈనాం ఎస్టేటు కాదని చెప్పబడింది ఈలోపల కొంతమంది మంత్రిగారి దగ్గరకు వెళ్ళినప్పుడు అది తప్పకుండా వస్తుందని మంత్రిగారు చెప్పారు అది ఏ విధంగా వస్తుందో నాకుమాత్రం అర్థంకావడంలేదు దీని విషయమై సుమారు 24 పేజీల judgment ఉన్నది. రెండు కారణాలవల్ల యిది రాలేదు 1956 చట్టం మేరకు మనం అనుకున్న ఉద్దేశాల ప్రకారం ఆ purviewలోకి రాకుండా, ఒక్కొక్క ఈనాం గ్రామం 'estate' గాకుండా పోతున్నదని తమ దృష్టికి తెస్తున్నాను. 'Named village' అనే సమస్యపై ఆ విధంగా heading లో వ్రాసినప్పటికీ కూడా అది సమంజసం కాదని, register లో ఉన్న లోపలి భాగంలో శ్రోత్రియం చల్లాయిపాలెం అని వుంటేనే ఈనాం ఎస్టేటుగా వస్తుంది, లేకపోతే రాదని తీర్పులున్నాయి

మొత్తం చల్లాయిపాలెంలో వున్న 1000 ఎకరాలలో 999 ఎకరాలు 'చల్లాయిపాలెం గ్రామంలో శ్రోత్రియం' అని ఉన్నప్పటికీ కూడా అని ఈనాం ఎస్టేటుగా రాకుండాపోతున్నది ఈ విషయంకూడా తప్పకుండా ఆలోచించవలసిన అవసరమున్నదని మనవిచేస్తున్నాను అదేవిధంగా 'have already been granted' అనే విషయంతో చాలా చిక్కు సమస్య వస్తుందని మనవిచేస్తున్నాను. 1956 Act pass చేసినంతవరకూ, తరువాత యిప్పుడు మనం అంతా ఆలోచిస్తున్నట్లు కూడా ఎక్కడైనా సరే కొన్ని భాగాలు మైనర్ ఈనాములుగా ఉన్నప్పుడు అది మొత్తంగా ఈనాం ఎస్టేట్లుగా రావాలని మన ఉద్దేశమని ఎన్నోసార్లు చెప్పుకుంటున్నాము. ప్రభుత్వం, ప్రతిపక్షాలవారు కూడా ఆ రకంగా రావాలని భావిస్తున్నారు. "Have already been" అనే విషయమై కోర్టువారిచ్చిన అనేక జడ్జిమెంట్సు ఉన్నాయి. ఈ portionను యీ చిన్న మైనరు యీనాము major grant కు దరిమిలా యిచ్చారా, లేక major grant కు ముందుగా యిచ్చారా అనే సమస్యపై వ్యాఖ్యానిస్తూ 'have already been'

అంటే ముందే యిచ్చివుండాలి అని interpretation యిచ్చి, ఆ రకంగా హైకోర్టువారు మైనరుగ్రాంటు ముందు యివ్వకపోయినట్లయితే తక్కిన యీనాం గ్రామం ఎస్టేటు కాదని తీర్పు యిచ్చారు 5 లేక 10 ఎకరాల మైనర్ ఈనాము లున్నప్పటికీ కూడ మొత్తం గ్రామమంతా ఈనాం అయినప్పటికీ కూడ major grant కు ముందుగా minor grant యిచ్చారు కాబట్టి యిది ఈనాం ఎస్టేటు కాదని అనేక తీర్పులు ఉన్నాయి దీనికి సంబంధించి ఒకటి, రెండు విషయాలు తమ దృష్టికి తేవాలని భావిస్తున్నాను

ఇది కృష్ణాజిల్లా చింతలపల్లి అగ్రహారమనే గ్రామానికి సంబంధించిన విషయం మొట్టమొదట కొంత భాగం main grant ఇచ్చినతరువాత Minor Inam grant యివ్వబడింది మొత్తం ఆ గ్రామంయొక్క విస్తీర్ణం 669 ఎకరాల 74 సెంట్లు, దాంట్లో కొద్దిగామాత్రం, అనగా 7 ఎకరాల 98 సెంట్లుకుమాత్రం 1755 లో main grant గా యివ్వబడింది ఇంకొకనికి రెండేళ్ళతరువాత 1757 లో 7 ఎకరాలుమాత్రం రెండవగ్రాంటుగా యివ్వబడింది అందువల్ల ఇది 'Inam Estate' కాదని దాంట్లో చెప్పబడింది

ఈ క్రింది హైకోర్టువారి తీర్పును చదివి వినిపిస్తాను

"There is no evidence of this and the inam register shows that in 1757, that is two years later, the zamindar granted 7 98 acres to another person, one Varanasi Ramaswami, for his personal benefit On the evidence before the Court, the only conclusion open is that the 7 98 acres came out of the lands reserved by the zamindar As we have indicated the inam register shows that there were waste lands not the subject of grant and 'wastage' does not necessarily mean land incapable of cultivation The inam statement mentions that the karnam had to point out where the 7 98 acres lay

The learned counsel for the first defendant has advanced numerous theories for which the record provides no support We can only have regard to the fact that after the grant on which he relies there was a grant by the zamindar of other land, which can only mean that the earlier grant was not of the whole village In these circumstances, the Act of 1945 does not help him. His appeal must be dismissed with costs of the plaintiff", అని ఉంది

అందువల్ల జమీందారుగ్రామం అంతా యిచ్చినప్పటికీ కూడా రెండేళ్ళ దరిమిలా ఆ 7 ఎకరాలు మాత్రం Minor Inam గా యిచ్చారు కాబట్టి "has already been" అనేటటువంటి మాటలు కలిగిన ఈ వాక్యంమీద మన Legislature యొక్క ఉద్దేశ్యంకు భిన్నంగా కేవలం ఒక 'లెటర్'ను తీసికొని

దాని spirit వదలి ఇలాంటి judgments యిచ్చారు అందువల్ల చాలా గ్రామాలు మనం అనుకునేటటువంటి ఉద్దేశం ప్రకారం, సవరణల ప్రకారం రాజాలకపోయినవని ఈలాంటి judgment లు చాలానే ఉన్నాయని తమకు మనవిచేస్తున్నాను

'Hamlet or Khandriga' అని పూర్వపుదానిలో నున్నది తరువాత 'in an inam village' అని కూడా explanation లో నున్నది కాని ఇప్పుడు దానిమాట ఇందులో ఏమీలేదు అదికూడా ఇందులో ఉంటేకాని బాగాఉండదు ఎందుకంటే, మీరుపెట్టే సవరణ వారుపెట్టే సవరణ ఒకటిగానే ఉన్నవి అందుచేత "in an inam village" లో పూర్వపు explanation లో ఉన్నది కనుక అదికూడా ఇందులో కావాలి

శ్రీ కె వెంకటరావు · ఇక్కడ ఎసంబ్లీలో కూర్చొని హైకోర్టులో చెప్పిన individual judgments అన్నిటిమీదా ఇక్కడేదో నా opinion చెప్పమంటే ఎక్కడ కుదురుతుంది? అది అసంభవమైన విషయం నేను అందుచేతనే general గా చెప్పాను చేసే లా చేస్తున్నాము చేశాము ఇది ఉట్టి drafting amendment మాత్రమే దీనిలో more meaning తీసుకురావటం కష్టం ఇంత చేసినప్పటికీ కూడా నిజంగా చేరవలసినది కూడా చేరలేదనేటటువంటి పరిస్థితుల నన్నిటిని ప్రభుత్వం విచారణచేసి సరైనటువంటి చర్యలను తీసుకుంటుందని చెప్పి దానితోనే ఆగిపోలేదు కాని ఇది చెప్పాలనుకుంటే ఎన్ని రోజులైనా చెప్పవచ్చు ఎందుచేతనంటే ఒక instance వుంటే "చాలా" అనే ముక్క ప్రయోగించి - చాలా అనేది రెండక్షరాల ముక్కే !— అసలు మొత్తమంతా "చాలా" లేదని చెప్పవలసి ఉంటే దీనిక్రింద చాలాగ్రామాలు పోతాయి "చాలాపోతాయి" అంటే, మొత్తం ఎన్నో చాలా ఉన్నాయి అంటే, "చాలా మిగిలా"యని దీనిని వదలిపెట్టవలసిందే కాని ఇంకొక మార్గంలేదు.

శ్రీ జి. యల్లమందారెడ్డి · అధ్యక్షా ! మాట్లాడినదే మరల మాట్లాడాలనే ఉద్దేశ్యంతో నేను మాట్లాడడంలేదు ఇవన్నీ మాకు అనుభవాలద్వారా వచ్చిన విషయాలు నిన్న వీటినిగురించి తమకు మనవి చేసినపుడు మంత్రిగారు పదే పదే చెప్పారు.

శ్రీ కె. వెంకటరావు : మళ్ళీ నన్ను అనవసరంగా quote చేయవద్దు. ఇవన్నీ వస్తాయని ఎప్పుడూ చెప్పలేదు వారు చెప్పేది రాకపోతే; నిజంగా చేరవలసిన అవసరంఉంటే దానిని చేర్చడానికి ఏమైనా amendment తీసుకు వస్తామని చెప్పాను, ఇపుడు చెప్తున్నాను, అంతా వస్తుందని నేను అంగీక

రించను మొత్తం అంతా దీనిక్రిందకురాదు ఉన్నటువంటి శాసనంమీద interpretation చెప్పవలసిన అధికారము కోర్టుకు ఉన్నది కోర్టు చెప్పింది, మనము అనుకున్నది కాక ఇంకొక అర్థం కనుక చెప్పినట్లయితే, ఇపుడు ఈ amendment ను ఎలా తీసుకువచ్చామో అలాగే యింకొక amendment తీసుకు రావాలి కాని ఇంకొక రకంగా చేయడానికి మార్గంలేదని మనవి చేస్తున్నాను

శ్రీ జి యల్లమందారెడ్డి మంత్రిగారితో ఈ విషయంలో ఏకీభవిస్తున్నాను మనం ఒక చట్టం పాస్‌చేసిన తరువాత దానికి court వారు ఒక interpretation ఇస్తారు కాబట్టి మన యొక్క ఉద్దేశం ప్రకారం interpretation రానపుడు దానికి తప్పకుండా సవరణ తీసుకురావలసిన అగత్యం ఎంతైనా ఉన్నది ఆ రకంగా మన ప్రభుత్వం ఇంతవరకు ప్రయత్నం చేయలేదనేదే నా వాదన

ఈవేళ ఒక చిన్న clause విషయంలో— సవరణ తెస్తున్నందుకు-అంతా సంతోషంగా అభినందిస్తున్నాము కూడా కాని అంతకుపూర్వం గ్రామాలకు సంబంధించినటువంటి ఈ విషయాల్లో తీర్పులు యిచ్చినపుడు దాని విషయం కూడా ప్రభుత్వంవారు సక్రమంగా ఆలోచించవలసిన అవసరం ఉంది సవరణ తేవలసిన అవసరం ఉంది, అని మంత్రిగారు చెప్పారు. చాలా కావచ్చు లేక ఒక గ్రామమే కావచ్చు. మాకు సంబంధించినంతవరకు మాకు అనుభవంలో ఉన్న సమాచారం తప్ప మొత్తం రాష్ట్రవ్యాప్తంగా ఉండే సమాచారం తీసుకు రావడానికి మాకు అవకాశం తక్కువ మాకుండే అవకాశాలు తక్కువ. అందువల్ల చాలా కాకపోయినప్పటికీ ఒక్కటే అయినప్పటికీ కూడా దాని విషయం మనం serious గా ఆలోచించాలని కోరుతున్నాను ఇందాక మనవి చేసినట్లుగా ఇంకొక judgment ఇదే సందర్భంలో తమకు చదివి వినిపిస్తాను

మిస్టర్ స్పీకర్ . చదివి వినిపించడం దేనికి ? ఈ సవరణకు సంబంధించినది ఉంటే చదివి వినిపిస్తే లాభం కాని, ఒక సిద్ధాంతం ఏమిటంటే, మనం ఇపుడు ఒక stage కి వచ్చాము, ఇంకా కొన్ని ఈనాములక్రింద వస్తే న్యాయమేమో, equity ఎట్లా ఉంటుందో చూస్తామన్నారు అది తరువాత రావలసినదేకాని, ఈవేళ ఈ బిల్లుయొక్క సవరణలో వచ్చేదికాదు దానినిమాత్రమే చదివితే లాభం , లేకపోతే లాభంలేదు

శ్రీ జి యల్లమందారెడ్డి · అధ్యక్షా, అసలు మేము అలా చదువుతామని అడగడంలేదు ఈ బిల్లు purview లో లేకుండా ఉండే విషయములను యిక్కడ ఇపుడు తీసుకురానవసరం లేదు అది తప్పే తరువాత ఏమైనా చెప్పవలసివస్తే ప్రభుత్వంతో చూసుకోవచ్చు. నా వాదనయొక్క ఉద్దేశంకూడా అదికాదు.

మనం ఏ ఉద్దేశ్యంతో ఒక సవరణను తీసుకువచ్చామో దాంట్లో కొన్ని మాటల వల్లగాని, లేకపోతే కొన్ని క్లాజులవల్లకాని మనం అనుకున్న ఉద్దేశ్యం నెరవేర నపుడు వాటికి సవరణలు తీసుకురావలసి యున్నది ఇప్పుడు ఈ ఒక్కదాని విషయంలోనే ఈ సవరణ తీసుకువచ్చారు ఇంకా ఇలాంటివి 3, 4 విషయాలు ఉన్నవి ఈలాంటి మాటలవల్ల మన ఉద్దేశ్యం నెరవేరకుండా ఉండే వ్యతిరేక మైన Judgment లు వచ్చినవి మనం అనుకున్న ఉద్దేశం కొన్ని మాటలవల్ల నెరవేరడంలేదు అనేటంతవరకు పరిమితమై మాట్లాడుతాను

మిస్టర్ స్పీకర్ అందులో చిక్కేమిటంటే మీరు ఇపుడు కొన్ని సవరణలు ఇచ్చారు మొదట ప్రభుత్వం వారు కొన్ని సవరణలు యిచ్చారు ఆ సవరణ క్రింద మీరు కొన్నిసవరణలుయిచ్చారు Government యిచ్చిన amendmentలో "hamlet or khandriga in an inam village" అనేదానిని కొట్టిపారేస్తున్నారు వారుకూడా Hamlet or Khandriga granted as inam అన్నారు " In an inam" అనే సుందరయ్యగారి సవరణను కొట్టివేశారు ఇపుడు, మళ్ళీ కొట్టేస్తున్నారు. మీరు ఇచ్చిన సవరణలలో దేనిమీద మీరు యిపుడు మాట్లాడుతున్నారు? ఇప్పుడు మనం consideration stage లోనే ఉన్నాము. ఇపుడు consideration లో ఎక్కువ మాట్లాడేకంటె సవరణ వచ్చినపుడు మీ యిష్టం వచ్చినట్లుగా మాట్లాడడం బాగుంటుందేమో అపుడు clear గా దానిసంగతి తెలుస్తుంది మాట్లాడవచ్చును అసలు మీరు ఇచ్చిన సవరణ చెల్లుతుందా చెల్లదా? అనేదికూడా ఒక question ఉన్నది నిన్ననే ఒకటి pass చేశాము మళ్లా ఎంతవరకు pass చేయగలము, ఎంతవరకు చేయకూడదు, అనేటటువంటిది కూడా ఉన్నది కదా! 'In the same session when one clause is passed, whether we can put the amendment to that very clause' అనేటటువంటి చాలా important question ఉన్నది అందువల్ల మీరు general గా మాట్లాడితే మంచిది. ఆ పైన clause by clause చర్చ వచ్చినతరువాత కావలసినంత మాట్లాడుదురుగాని అపుడు ఈ judgments ను కూడా చదివి వినిపించడం మంచిది ఎందువల్లనంటే యిపుడు మీరంతా జనరల్‌గా యివన్నీ మాట్లాడుతుంటే నాకేమీ బోధపడడం లేదు

శ్రీ జి. యల్లమందారెడ్డి: మీతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను అయితే ఈ సందర్భంలో general lines లో, మొత్తం యిక్కడ ఈ సవరణకు సంబంధించినదానిని చదువుతాను. అసలు అనుకొన్నటువంటి ఉద్దేశాలు explanation లో ఎలాగరాతేదో, ఒకటో, అరో ఉదాహరణలు చూపించు

దామనే నా ఉద్దేశం 'Estate' కాదనే సందర్భంలోనే ఇంకొక విచిత్రమైన విశేషం ఏమిటంటే, ఒక గ్రామంలో ఒక మైనర్ ఈనాము major grant కు ముందు యిచ్చారా, major grant కి తరువాత యిచ్చారా అనే విషయం court వారికి తేలలేదు కాబట్టి రైతు major grant కంటే ముందే యిచ్చినాడని, prove చేసుకోలేదు కాబట్టి, ఇది 'Inam Estate' కాలేదని చెప్పబడి నటువంటి Judgment యిది 'Already' అని మన చట్టంలో పెట్టినప్పటికీ కూడా 'already' అని అంటే ముందుగానే ఇచ్చారా ? లేక తరవాత ఇచ్చారా ? అనే విషయం కోర్టువారు తేల్చలేకపోయారు కోర్టువారు తేల్చుకొన్నమీదట judgment ఇస్తే అది ఒక రకం ఈనాందారు, రైతు ఇద్దరూ produce చేసిన సాక్ష్యం ద్వారా కాని, ప్రభుత్వం వారి యొక్క రిజిష్టరులద్వారా కాని మైనరు గ్రాంటు ముందు ఇవ్వబడిందా తరువాత ఇవ్వబడిందా అనే విషయం తేలవలసి యున్నది ముందు ఇచ్చారా ? తరువాత ఇచ్చారా అనే విషయం తేలలేదు కాబట్టి, మైనరు గ్రాంటు మేజరు గ్రాంటుకు ముందే యిచ్చారని రైతు, prove చేసుకోలేక పోయినాడు కాబట్టి ఇది 'inam estate' కాదు అని judgment చెప్పబడి ఉన్నది (Andhra Weekly Reporter, Vol. II, Part 26-1956, పేజీ 750) 'Already' అని ఉండడం వల్ల ఈ విధంగా చెప్పబడింది అందుచేత 'already' అనే మాటవల్ల యిలాంటి ఇబ్బందులు వస్తున్నాయి అని నేను మనవి చేస్తున్నాను ఇకపోతే అదే clause లో 'certain lands' అని చెప్పబడి యున్నది 1956 వరకూ మన ప్రభుత్వం తెచ్చిన సవరణల ఉద్దేశం ఒక యీనాం గ్రామంలో కొన్ని చిన్న మైనరు యీనాము లున్నను అది ఎస్టేటు కావాలని ఆశించవలసినది ఒక major grant క్రింద యివ్వకపూర్వం కాని, తర్వాతకాని చిన్న grant యిచ్చినపుడు 'certain lands' అని చట్టములో వ్రాయబడినందున certain అంటే, ఫలానా specific భూమి ఫలానా నేరేడిపల్లి గ్రామంలో ఫలానా తూర్పుచేను అని పేరు పెట్టిఉంటేనే అది minor inam గా అవుతుంది కాని, ఫలానా భూమి అని specify చేసి, భూమియొక్క location ఏదో definite గా తీసుకు రాలేదు కాబట్టి ఇది 'minor inam' కాదని, అందువలన మొత్తం గ్రామం (1954-2-M L J పేజీ 458) 'inam estate' కాదని judgment చెప్పబడింది అందువల్ల ఈ 'certain' అనే పదాన్ని పూర్వపు చట్టంయొక్క ఉద్దేశం ప్రకారం మార్చవలసియున్నది.

ఒక జమీందారు ఒక గ్రామాన్ని ఒక ఈనాందారుకు ఇచ్చినా అందులో ఏ కొద్దిభాగమునో తనకు ఉంచుకున్నాడని దరిమిలా లెక్కలవల్ల తేలినది జమీందారు పేష్కష్ కట్టలేదుకాబట్టి, ఈనాంలో ఏ కొద్ది భూమో జమీందారు

స్వంతభూమి కాబట్టి దానిని గవర్నమెంటువారు జప్తుచేసి కలుపుకున్నారు కాబట్టి మొత్తము గ్రామములో ఉన్న ఈ 10 లేక 12 ఎకరాలు జమీందారు స్వంతభూమి అంటున్నారు కాబట్టి, 3 (1) (d) ఎక్స్ప్లనేషన్‌లో చిన్న యీనాములుగాని, కమ్యూనల్ పోరంబోకలుగాని అని చెప్పియున్నారు కాబట్టి యీ జమీందారు స్వంతంగా వుంచుకున్న 10 ఎకరాలభూమి పై నిర్వచనంక్రిందికి రాదు కాన మొత్తంగ్రామం యీనాం అయిననూ అది ఎస్టేటు నిర్వచనం క్రిందకు రాదని హైకోర్టు తీర్పు చెప్పినది (1950-2-M L J పేజి 609)

ఇంతకన్నా విచిత్రమైనవిషయం ఇంకొకటున్నదా? మొత్తంగ్రామంలో 10 లేక 12 ఎకరముల భూమి జమీందారు స్వంతభూమి కాబట్టి, ఆ 10 లేక 12 ఎకరములు మైనరు ఈనాం లేక కమ్యూనల్ పోరంబోకు కాదుకాబట్టి మొత్తం గ్రామం ఎస్టేటుకాదని చెప్పటం సరైనదేనా?

ఇంకో విషయం మరీ విచిత్రంగా ఉన్నది. మొదట ఒకగ్రామములో ఒక కంౘిక ఉన్నది ఒక ఈనాందారుకు ఒక జమీందారు దానిని ఇచ్చాడు తరువాత అసలు గ్రామాన్నికూడా ఆ ఈనాందారుకే మరొకతేదీనాడు జమీందారు ఇచ్చాడు కాని ఈనాం ఎస్టేటు నిర్వచనం ప్రకారం కంౘిక 'Portion of the village' కాబట్టి, గ్రామంకూడా 'పోర్షన్ ఆఫ్ ది విలేజ్' కాబట్టి రెండు ఈనాం ఎస్టేటుకాదని చెప్పబడినది. 1956 వ సంవత్సరములో చేసిన సవరణ చట్టం ప్రకారం కంౘికలు దాని పర్యాయ్యంలోనికి రావడానికి వీలున్నది కాని మెయిన్ విలేజ్‌లో వందలు, వేలు ఎకరాలు ఉన్నప్పటికి అది ఏ నిర్వచనం క్రిందకు రాకుండా అది మైనర్ ఈనామ్ అని హైకోర్టు తీర్పుయిచ్చినది (1956 Andhra Weekly Reporter, Vol II, Part 15, పేజి 358). ఇటువంటి ఎనామలీస్ లేకుండా చట్టాన్ని సవరించాలి

అంతేకాకుండా ఎక్స్ప్లనేషన్‌లో 'subsequently' అనే పదం ఉన్నది. దీనివల్ల చాలా ప్రమాదం ఉన్నదని మనవి చేస్తున్నాను గవర్నమెంటు గ్రామాలకు ఆటాచ్ అయివున్న కంౘికలు సివార్లుగా ఉన్నవానిని ఎస్టేటుగా పరిగణించే విషయములో కొంత అనుమానానికి దారిదీసేదిగా యీ పదజాలం ఉన్నది. 'Subsequently' అని ఉన్నందువల్ల యీ కంౘికలు, సివార్లు ఈనాం గ్రామాలకు పూర్వము ఆటాచ్ అయియుండాలనే భావం కలుగుతున్నది. ఒక యీనాం 'subsequent' గా ఇచ్చినదా, కాదా అని నిరూపించే బాధ్యత రైతు మీద ఉన్నదని హైకోర్టు తీర్పు చెబుతున్నది కాన యీనాటి కంౘికలు పూర్వమెప్పుడో వంద రెండువందల ఏండ్లనాడు యీనాం గ్రామాలకు అనుబంధంగా వున్నాయని రైతు ఎలా నిరూపించగలడు? కావున యీ మాటను తొలగించాలి. ఈ బిల్లులోని క్లాజులలో ఉపయోగించిన పదజాలానికి certain lands in an

**inam village, subsequently** మొదలైన వాటికి ఎన్నో విధములైన వ్యాఖ్యానాలు న్యాయస్థానములలో వచ్చాయి కాబట్టి యీ పదజాలములకు సరైన నిర్వచనములు యీయవలసి ఉన్నది రైతుల హక్కులకు భంగంకాని విధంగా యీ మాటలకు సరి అయిన డెఫినిషన్ ఉండేటట్లు చూడాలి

1908 వ సంవత్సరమునుంచి ఇంతవరకు రైతుల హక్కులను రక్షించుటకు ప్రభుత్వములు తీసుకుంటున్న చర్యలు, వాటి ఉద్దేశములు సక్రమముగా నెరవేరేటట్లు చూడవలసిన అవసరం ఎంతయినా ఉన్నది అయితే ఆ యా చట్టములలోని వర్డింగ్‌లోగల లోపములవల్ల కోర్టులు ఇచ్చిన జడ్జిమెంటుల రీత్యా ప్రభుత్వంవారి ఉద్దేశములు పూర్తిగా నెరవేరడం లేదు ఇటువంటి లోటుపాట్లను అధిగమించి రైతుల హక్కులకు భంగం వాటిల్లని విధంగా యీ బిల్లులోని మాటలకు నిర్వచనములు చేయవలెనని మనవి చేస్తున్నాను ఎస్టేటు లాండ్ చట్టంలోని క్లాజు 3 (11) (డి) కి ఇంతవరకు ఏ ఉద్దేశంతో సవరణలు చేయబడినవో ఆ ఉద్దేశములు నెరవేరేటట్లు కనీసము చూడాలి అందువల్ల యీ బిల్లులోని క్లాజులను, సాంకేతిక పదాల నిర్వచనాలను సమగ్రంగా చర్చించడానికి అవకాశ మియ్యవలసినదని తెలియచేస్తున్నాను

*శ్రీ జి లచ్చన్న (సోంపేట) అధ్యక్షా, ఇటువంటి బిల్లును మనం గత సంవత్సరం ఆంధ్ర శాసనసభలో చర్చించి పాస్ చేయడం జరిగింది కాని యీనాడు తప్పనిసరిగా దానికి ప్రభుత్వం ఒక సవరణ తీసుకొనిరావలసిన పరిస్థితి యేర్పడినది మనము ఇదివరలో ఏ ప్రధాన ఉద్దేశంతో చట్టంగా పాస్ చేశామో ఆ ఉద్దేశం నెరవేరని కారణాన యీనాడు యీ సరవరణ బిల్లు తీసుకొని రావలసి వచ్చినదని ప్రత్యేకంగా చెప్పవలసిన పనికాదు కొన్ని యీనాములు చిన్నవి కావి 3 (11) (డి) నిర్వచనం క్రిందకు రాకుండా పోతున్నాయనే కారణంవల్ల యీ బిల్లు తీసుకొని రాబడింది ఈనాడు కొందరి సభ్యులలోను, ముఖ్యంగా యీనాం గ్రామాలలోని రైతాంగంలోను కొన్ని భయ సందేహాలు ఏర్పడి ఉన్నవి తాము ఎంతో కాలంగా సాగుచేసుకుంటున్న భూములపై తమ హక్కులు ఏవిధంగా ఉండబోతాయనే సందిగ్ధస్థితి ఏర్పడింది వారు సాగుచేస్తున్న భూములు ఎస్టేట్లుగా పరిగణించబడుతాయా లేదా అనే ఆందోళనా స్థితిలో వారున్నారు అయితే ప్రభుత్వంవారు చేసిన చట్టములోని లోపములవల్ల న్యాయస్థానములకు కొన్ని పదముల అర్థం అది కాదు, ఇది కాదు - అని నిర్వచనం చెప్పవలసిన అవసరం కలిగింది. ఇప్పుడు యీ బిల్లును ఆమోదించినప్పటికి ఇకముందుకూడా కొన్ని సందేహాలు రావచ్చు. అయితే ప్రభుత్వ ఉద్దేశాలను పూర్తిగా నెరవేర్చే నిమిత్తమై అవసరమైతే సవరణలు తీసుకొని రావడానికి యత్నిస్తామని మంత్రిగారు ఇచ్చిన హామీవల్ల

ప్రజలకు కొంత ఊరట కలుగవచ్చు అందువల్ల దీనిని గురించి ప్రత్యేకంగా సందేహాలు పెట్టుకోనవసరం లేదని మనవి చేస్తున్నాను

ఈ బిల్లుయొక్క క్లాజులలోని సాంకేతిక పదాలకు ఇచ్చిన నిర్వచనాలు ప్రభుత్వంవారి ఉద్దేశాలను పూర్తిగా ప్రతిబింబించేవిగా ఉండాలి మాటకు కోర్టులలో నిర్వచనాలు జరుగుతున్నాయి మేజర్ గ్రాంటుకు పూర్వము, తర్వాత అనే దానిని గురించి కోర్టులలో నిర్వచనలు వస్తున్నాయి మేజర్ గ్రాంటుకు పూర్వం ఇస్తేనే already అనేమాట సరిపోతుంది కాని, మేజర్ గ్రాంటుకు తర్వాత ఇచ్చినవాటికి already అనేపదం సరిపోదని కోర్టులు అంటున్నాయి 1956లో చట్టమును పాస్ చేసినతరువాత కూడా అది పాస్ చేయబడిన తేదీకి పూర్వం ఇవ్వబడిన తీర్పులను ఎంతవరకు న్యాయస్థానాలు వాటిని పరిగణించాలి, వాటిని అనుసరించి ఎంతవరకు చర్యతీసుకోవడానికి అవకాశం ఉంటుంది, అని చెప్పడానికి ఇప్పుడే ఆస్కారంలేదు

ప్రభుత్వం పదేపదే చేస్తున్న విస్పష్ట ప్రకటనల ననుసరించి, అవసరమైతే ఈనాడు మనం చేసే సవరణవల్ల, ఎస్టేటు ప్రాంతాలలో ఈనాము ప్రాంతాలలో, ఖండ్రికగాని, శివారుగాని సంబంధించి ఉండే ఈనాముగా యివ్వబడిన భూమి ఈ ఎస్టేటు నిర్వచనం క్రింద రాకుండా మినహాయింపబడినప్పుడు, మరొక సవరణ తెచ్చి, పూర్వపువాటితో సరిసమానమైన ప్రతిపత్తి యిచ్చి వాటి ప్రతిఫలాన్ని రైతులు అనుభవించుటకు సవరణ తీసుకు రాగలమని మంత్రిగారు పదేపదే చెపుతున్నప్పుడు, దీనిని గురించి ఎక్కువ సందేహించ నవసరం లేదని సోదర సభ్యులకు మనవిచేస్తున్నాను ఈ సవరణ మన ఉద్దేశం నెరవేరుస్తుందా, లేదా అనే సందేహం తప్ప, యీ సవరణచట్టం అవసరమా, లేదా అనే దానిలో భేదాభిప్రాయం లేదు మన ఉద్దేశం పూర్తిగా నెరవేరక పోయినచో, తిరిగి తగినచర్య తీసుకొనుటకు సిద్ధంగా ఉన్నామని మంత్రిగారు పదేపదే చెపుతున్నప్పుడు దీనిని గురించి ఎక్కువ సందేహించ నవసరం లేదు అవసరమయినప్పుడు ప్రభుత్వం యిచ్చిన హామీ తప్పక పాటిస్తుందని భావిస్తూ నేను ఈ సవరణ బిల్లును బలపరుస్తున్నాను.

శ్రీ వి. వి. కృష్ణంరాజా బహద్దూర్ (తుని) - అధ్యక్షా! ఈ బిల్లుగురించి రెండుసూచనలు తమద్వారా మనవిచేస్తూ వాటినిగురించి మంత్రిగారు విస్పష్టముగా సెలవివ్వాలని కోరుతున్నాను. ఇదివరకుతెచ్చిన ఈనాం అమెండ్‌మెంట్ బిల్లుద్వారా ఈనాం గ్రామం ఖాల్సా ఖండ్రిక, hamlet క్రింద 3, (ii) (d) క్రింద ఎస్టేటుగా పరిగణింపబడవలెనని [illegible] కాని, అందులో "in

an Inam village" అని చెప్పటం, దిగువన "as such" అని ఉన్న కారణంచేత జమీందారీ, రైత్వారీ గ్రామాలకు సంబంధించిన ఖండ్రికలు, hamlets ఈనాములుగా యిచ్చినప్పటికీకూడ, అది వర్తించలేదు ఇటీవల కోర్టుతీర్పులద్వారా అవి ఎస్టేట్సుగా పరిగణించబడకుండా exclude అయిపోయినవి వాటినికూడా ఎస్టేట్సుగా పరిగణించి 3 (ii) (d) క్రింద తీసుకురావలెననే ఉద్దేశంతో అమెండ్మెంట్ తీసుకువచ్చినారు కాని నాకు ముందుమాట్లాడిన సభ్యులు యిందులో confusion వస్తున్నదనిచెప్పినారు ఈ అమెండ్మెంట్లో confusion లేదని నేను సవాల్ చేసి చెపుతున్నాను. మనకు రెండు తరహాల ఈనాములు ఉన్నవి, (1) మైనర్ ఈనాములు ఇదివరకు మైనర్ ఈనాములు రైత్వారీక్రింద convert చేశాము అది ఆక్టు పాస్ అయి అమల్లో ఉన్నది (2) 3 (ii) (d) క్రింద whole village ఈనాంఅయితే ఎస్టేటుగా పరిగణించాలనేది old Act Subsequent గా different times లో different grants వచ్చాయి కాబట్టి—it is not whole village అని తీర్పులు వచ్చాయి ఖండ్రిక, hamlets కూడ main village కాదు కాబట్టి అవికూడ ఎస్టేటు కాదని తీర్పులువచ్చాయి ఆతీర్పులను సమన్వయం చేసుకొని different times లో different grants వచ్చినా కూడాఅవిఎస్టేట్సుగా పరిగణించాలి రెండవది, main village కాకపోయి నప్పటికీ ఈనాం గ్రామం బాపతుఖండ్రిక, hamlet అయినప్పటికీ, ఎస్టేటుగాపరిగణించాలని సుస్పష్టముగా చెప్పాము కాని జమీందారీ గ్రామంలోగాని, ఇంకొక గ్రామంలోగాని ఎకరం యిచ్చినా, రెండు ఎకరాలు యిచ్చినా అది ఈనాం ఎస్టేటు అవాలని అంటే సాధ్యంకాదు, అసంభవం ఆ minor inams అన్నింటిని యిదివరకు రైత్వారీగా convert చేశాము ఒక గ్రామంలో 150 ఎకరాలు waste landగా యిచ్చారు కాబట్టి అది ఎస్టేటుగా చేర్చాలంటే అది ఎప్పుడూ ఎస్టేటుకాదు గ్రామమనండి, ఖండ్రిక అనండి, hamlet అనండి—ఈ హద్దులమధ్య గ్రామం, ఈ హద్దులమధ్య ఖండ్రిక, ఈ హద్దుల మధ్య శివారు, అని గ్రాంటులో ఉన్నప్పుడే అది ఎస్టేటుగా 3 (ii) (d) క్రింద పరిగణింబడుతుంది మిగిలినవి యిదివరకే minor inams క్రింద అయిపోయినవి దీనిలో confusion లేదు నేను మంత్రిగారిని కోరేది—గ్రాంటు పుట్టబోయేసరికి, ఖండ్రిక, శివారు, ఈనాం అనే నిర్వచనం గ్రాంటులో ఉన్నప్పుడు అది 3 (ii) (d) ఎస్టేటు క్రింద రావాలితప్ప, గ్రాంటులో అది లేనప్పుడు, waste land గా యిచ్చినప్పుడు—అది minor inam క్రింద వస్తుందనే నిర్వచనం conclusion లో సుస్పష్టంగా సెలవివ్వాలని కోరుతూ విరమిస్తున్నాను.

శ్రీ బి. శంకరయ్య అధ్యక్షా, మొన్న నేను చదివి వినిపించినట్లుగా మా జిల్లాలో 32 ఈనాంగ్రామాలు గవర్నమెంటు రిజిష్టరులో ఉన్నవి 32

ఖండ్రికలు ఉన్నవి వీటివిషయమై నెల్లూరుజిల్లాలో అక్టోబరు 23 వ తేదీన ఈనాంరైతుల సమావేశం జరిగింది అదేవిధంగా యిక్కడ నవంబరు 2 న ఆంధ్రప్రదేశ్ ఈనాంరైతుల సమావేశం జరిగింది ప్రభుత్వం రిజిస్టరులో ఉన్న ఈనాంగ్రామాలు అని పేర్కొన్నవాటి నన్నింటిని ఎస్టేట్సుక్రింద పరిగణించే టట్లు చేయాలని రైతులు కోరుతున్నారు ఆ విధంగా చేస్తామని, ప్రభుత్వం, కాంగ్రెసుపార్టీ, అందరూ హామీయిచ్చారు కాని ప్రభుత్వం ఆలస్యం చేసే టట్లున్నది ఈ చట్టంలో అటువంటి సవరణ త్వరగా చేయాలి ఒకసారి కోర్టు తీర్పు వచ్చినతరువాత, ప్రభుత్వం చట్టాన్ని సవరించేదాకా, ఈనాందారులు ఊరుకోనరు ఈనాందార్లు సివిల్ కోర్టుకు వెళ్ళి భూములనుంచి రైతులను తొలగిస్తున్నారు ఈనాంరైతులను భూములనుంచి తొలగించకూడదని, చట్టాన్ని సవరిస్తామని పదేపదే అసెంబ్లీలో చెప్పుటవలన నిజంగా ఆ భూములు తమకు వస్తాయని రైతులు ఆశపెట్టుకున్నారు కాని ప్రభుత్వం ఆ విధంగా సవరణ చేయనందున, కోర్టులు యిచ్చిన తీర్పులవల్ల అక్కడ రైతులను తొలగిస్తున్నారు. రైతులకు ఎటూకాని పరిస్థితి ఏర్పడుతోంది వేలకువేలు ఖర్చుపెట్టి కోర్టులచుట్టూ తిరగవలసి వస్తున్నది ఈనాందార్లుకూడా డబ్బు ఖర్చుపెట్టు కొంటూ సుప్రీమ్‌కోర్టుదాకా అనేక కేసులలో పోయారు కాబట్టి యిది రైతులకు, ఈనాందార్లకు కూడ లాభదాయకమైన విషయంకాదు 1956, 55, 54 అంతకు ముందునుంచికూడ తీర్పులు యిస్తున్నప్పుడు, ఆ విషయం ప్రభుత్వం గుర్తించనందున, ఈనాందారులు proceed అవుతున్నారు రైతులను భూములనుంచి తొలగిస్తున్నారు కాబట్టి గవర్నమెంట్ రిజిష్టరులో ఈనాం గ్రామం అని పేర్కొనబడినవి, మైనర్ ఈనాం అయినాసరే, రెండుమార్లు గ్రాంటు యిచ్చినాసరే - గుర్తించాలని, ఆ సమావేశంలో తీర్మానంద్వారా కోరారు. తరువాత గవర్నమెంట్ గ్రామానికిగాని, జమీందారీ గ్రామానికి గాని attach అయిన ఖండ్రికలు, hamlets ఈనాములు ఉన్నవి. ఆ ఈనాములు "made and comfirmed" గ్రాంట్ అయినవి. జమీందారీ గ్రామాలకు attach అయి, అవి taken over అయిన తరువాత గవర్నమెంటు గ్రామానికి attach చేశారు. అయితే subsequent గా attach అయినట్లు రుజువుచేయాలి. 1802 లో ఈనాంకమీషన్ గుర్తించినప్పుడు ఉన్నదో, ముందు ఉన్నదో, తర్వాత ఉన్నదో రుజువుచేయాలి తర్వాత ఉంచేసే గుర్తిస్తామని ప్రభుత్వం చెపుతున్నది. ఈ 'subsequent' అనేమాట తీసివేయవలెనని ఈనాంరైతుల సమావేశంలో తీర్మానంద్వారా కోరారు. ఈనాం ఖండ్రిక అని, ఈనాం hamlet అని గుర్తించిన తరువాతనే ప్రభుత్వం రెవిన్యూ అకౌంట్సు సౌకర్యంకోసం గ్రామానికి attach చేశారు. Attach చేయకుండా ఉన్న

గ్రామాలలోని రైతులకు, అవి ఎస్టేట్సు అని గుర్తించి ఆ భూములమీద రైతులకు హక్కు కలుగజేసేందుకు చేశారా ? ఈ 'subsequent' గా అనేది ఎప్పుడుచేశారో రుజువు చేయనందువల్ల తరతరాలనుంచి అనుభవిస్తున్న వారిని తొలగించి రైత్వారీపట్టా యివ్వడం జరుగుతున్నది అందువల్ల ఆసమావేశంలో అన్నిపక్షాల తరఫున రాజకీయభేదాలు లేకుండా రైతులు పాల్గొని "subsequent" తీసివేయాలని, ఈనాంఖండ్రిక, hamlet ఎప్పుడు attach చేసినప్పటికీ ఆ భూములనుంచి రైతులను తొలగించకూడదు అని తీర్మానం చేశారు రైతుల హక్కులు నిలబెట్టాలంటే ఈ రెండు తీర్మానాలలో కోరినవిధంగా ప్రభుత్వం వెంటనే చర్య తీసుకోవాలి ఆలశ్యం చేసినకొద్దీ రైతులకు భూములు లేకుండా పోతాయి కొన్ని వేల ఎకరాలనుంచి రైతులను తొలగిస్తున్నారు రైతులకు నష్టం కలుదుతోంది

ఎస్టేట్సు లాండు చట్టం సవరించడం ఆలస్యం చేసేటట్లయితే, ఇనామ్ ఎబాలిషన్ యాక్టు క్రింద రైతులను తొలగించటానికి ఇనాందార్లు ప్రయత్నం చేస్తున్నారు "ఇప్పుడు పది రూపాయలే శిస్తు చెల్లిస్తున్న ఇనాంరైతులను టెనన్సీ యాక్టు క్రింద పంటలో 50 పర్సెంటు చెల్లించాలి కాబట్టి మీరు 1945 నుంచో, 1956 నుంచో మాకు 50 పర్సెంటు చెల్లించలేదు కాబట్టి, రైతులను వెంటనే భూమి నుంచి ఎవిక్ట్‌చేయాలి" అని ఇనాందార్లు యీ టెనన్సీ యాక్టు ప్రకారం తహశీల్‌దారు కోర్టుకు వెడుతున్నారు "ఇవి ఇనాము భూములు. ఇవి ఇనాము గ్రామాలు ఈవిధంగా గవర్నమెంటు రిజిష్టర్‌లో ఉన్నవి అది రైత్వారీ టెనన్సీ యాక్టు" కాబట్టి ఇవి తీసుకోటానికి వీలుకాదని చెప్పినా తహసీల్‌దార్లు తీసుకొంటున్నారు ఈ విషయం కలెక్టరుకు చెప్పితే, "తహశీల్‌దారు ఎవిక్షన్ ఇచ్చిన తర్వాత ఆర్ డి. ఓ కు అపీలుచేసుకోమంటున్నారు. ఆ విషయం కోర్టు చూడాలి అని గవర్నమెంటు అన్నతర్వాత నేనెట్లా ఇంటర్‌ఫియర్ అయ్యేది ? సబార్డినేట్‌గా తహసీల్‌దారుకు ఆర్డరు పంపుటకు వీలు కాదు దీనికి ఒక లీగల్‌పొజిషన్ ప్రభుత్వం కలుగజేసినపుడు యీ విషయాన్ని డైరక్టుగా తీసుకోటానికి వీల్లేదని చెబుతున్నారు ఆ భూములు నిలబడాలంటే ఏమి చేయాలి ? ఈ భూములను టెనెన్సీ యాక్టు క్రింద తీసుకోకూడదు అని ప్రభుత్వం ఉత్తరువు పంపాలి ఆ భూములకు రైత్వారీ పట్టా, ఇనాందారుకు ఇవ్వటము ఆపుచేయాలి. రాజకీయ భేదాభిప్రాయం లేకుండా, ఇనాంరైతులందరు, కాంగ్రెసువారు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు అందరు కూడ సమావేశమై రైతులను భూములనుంచి తొలగించకుండా ఉండాలని కోరారు. ఆ విధంగా భూములకు రైత్వారీ పట్టా ఇవ్వటాన్ని ఆపుచేయాలని కోరారు.

కాబట్టి ప్రభుత్వం రైతులను భూముల నుంచి తొలగించకుండా కాపాడాలని, అందుకు హామీ ఇవ్వాలని కోరుతూ విరమిస్తున్నాను

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య (సత్తెనపల్లి) అధ్యక్షా, ఈ బిల్లు న్యాయంగా తీసుకురావలసిన అవసరంలేదు ఆ రోజు, ఆంధ్రరాష్ట్రంలో ఒక అమెండ్‌మెంటు ప్రభుత్వం తెచ్చినపుడు, "ఇనాము విలేజ్ అన్నట్లయితే, ఏనాటికైనా ఇబ్బంది వస్తుందని, అందువల్ల మరోవిధంగా దానిని అన్వయించాలి" నేను సూచించాను "Every khandrika or anything in the Inam village" అంటే, అది "Inam village" అవునా, కాదా అనే తగాదా వస్తుందని నేను అంటే, "ఫరవాలేదు అది పెట్టినా ఫరవాలేదు" అని ఆరోజున ఆ రకంగా చేశారు ఇంకో సెక్షనును ఇవాళ తీసుకరావలసిన అవసరం వచ్చింది ప్రతితడవా, వీటికి సవరణలు తీసుకువచ్చి, చేసిన తప్పులు దిద్దుకోవటం జరుగుతోంది. ఇది "అయ్యవార్లంగారు ఏంచేస్తున్నారు అంటే, చేసిన తప్పులు దిద్దుకొంటున్నారు," అన్నట్లుగా ఉన్నది ఇది కొంతవరకు సంతోషించవలసిన విషయమే ముందు తప్పులు చేసినా, తర్వాతనైనా దిద్దుకొంటున్నారు చేసిన తప్పులు దిద్దుకోకుండా ఉండేదానికన్నా, దిద్దుకోవటం కూడ మంచిదే మొత్తంమీద ఇది సమన్వయం అవుతుందా, అన్న అనుమానం ఉన్నది మొదటిభాగం కొంతవరకు అర్థం అవుతుంది కాని, ఆఖరుభాగము అంటే, రెండవ సెక్షన్ ఎందువల్ల తీసుకువచ్చారో బోధపడలేదు "Came to be designated"కు "has come to de designated" కు కొద్దిగా తేడా ఉన్నది అనుకోండి ఇట్లాంటివి ఎన్ని ఉన్నాయో, గవర్నమెంటు క్రోడీకరణ చేయాలి ఒక్కొక్క హైకోర్టు జడ్జిగారు తన అభిప్రాయం ప్రకారం ఒక్కొక్క జడ్జిమెంటు ఇస్తూ ఉండటం, దానిని అనుసరించి మనం సవరణలు తేవటం మొదలుపెడితే చాలా కష్టం అవుతుంది. కరెక్టు చేసుకోవటం సరైనపద్ధతి అని అందరూ అంగీకరిస్తారు కాని దీని ఎఫెక్టు ఏమి అవుతుంది? ఇట్లాంటివి ఎన్నో లోపాలు ఉన్నాయి. అవన్నీ మనం సవరణ చేయవలసిన అవసరం ఉన్నది. మొన్న ఒక బిల్లు పాస్ చేశాము 1936 వ సంవత్సరపు యాక్టును డిలీట్ చేస్తూ. దానికి సంబంధించిన ఇనాములన్నీ ఎస్టేటులుగా చేశాము. కొత్తగా ఎస్టేటు మనం క్రియేట్ చేశామా అంటే నిజంగా క్రియేట్ చేశామనే తోస్తుంది. అక్కడ భూమి క్రియేట్ చేయలేదు కాని, రైట్ క్రియేట్ చేశాము అని నేను క్రిందటిసారి మనవిచేశాను ఇదివరకు నోటిఫికేషన్సు ఇవ్వబడినవన్నీ. ఎస్టేట్ లాండ్ యాక్టుక్రింద ఎస్టేట్సుగా డిక్లేర్ కావలసిన అవసరం ఉన్నదని నేను మొట్టమొదటి బిల్లులో ఒక సవరణ తీసుకువస్తే, "దానికి అక్కడ ప్లేస్ లేదు, రెండవ బిల్లులో తీసుకుర"మ్మన్నారు. రెండవ బిల్లులో తీసుకువస్తే

"ఇది ఇక్కడ సందర్భంకాదు, అది ముందుబిల్లులో వచ్చిఉంటే, బాగుండేదేమో, కనుక అవుట్ ఆఫ్ ఆర్డర్" అని ఎత్తేశారు ఎక్కడ ఏది పెట్టాలో తెలియనటువంటి సమన్వయంతో మనం నడుస్తున్నట్లుగా తోస్తున్నది ఇప్పుడు ఎనేబిలింగ్ యాక్టులో దీనికి ఇంకొక అవకాశం వచ్చింది ఇదివరకు ఉన్న అన్ని యాక్టులు త్రోసిపారేసి, మళ్లీ, 1936 వ సంవత్సరపు యాక్టును రద్దుచేసి, దానిక్రింద ఉన్న ఇనాములు ఎస్టేట్లు అవుతాయని చెప్పినదానినిబట్టి చూస్తే, మనం బహుశా ఎస్టేట్సును క్రియేట్ చేసినట్లే అయింది ఇదివరకు అవి మైనర్ ఇనాములు క్రింద ఉండినవి ఇప్పుడు వాటిని ఎస్టేట్సుగా డిక్లేర్ చేశాము ఇప్పుడు యీ యాక్టు ప్రకారంగా కొత్తగా ఎస్టేట్సును క్రియేట్ చేశాము కాని దాని అన్వయం ఏమి అవుతుందో నాకు బోధబడటంలేదు అది మంత్రిగారు వివరించవలసిందని కోరుతున్నాను 1936వ సంవత్సరపు యాక్టుప్రకారం బొబ్బిలిరాజాగారు నిర్ణయించినటువంటి ఎస్టేట్సును మనం 1948 వ సంవత్సరపు యాక్టులో మినహాయింపులు చేసి, మొత్తంగా ఎస్టేట్‌లాండ్ యాక్టుక్రింద ఇచ్చిన నిర్వచనం ప్రకారంగా ఉన్నటువంటివన్నీ వస్తాయి అన్నాము ఇవన్నీ ఇనామ్ విలేజెస్‌గా ఆ గ్రామాలలెక్కలలో అగుపడుతున్నది అదే మొన్న శ్రీ అయ్యపురెడ్డిగారు కూడా ఉదాహరణగా ఇచ్చారు ఆవిధంగాచూస్తే, గుంటూరు జిల్లాలో 125 ఇనామ్ గ్రామాలున్నట్లు కనిపిస్తున్నది, ఈ 125 గ్రామాలు దీంట్లో లెక్కలోకి వచ్చే పరిస్థితి ఉంటే పరవాలేదు కాని మళ్ళీ అనుమానం వచ్చే పరిస్థితి ఉన్నది 125 ఇనాము గ్రామాలేగాక, గుంటూరుజిల్లాలో ఇంకా ఖండ్రికలు ఉన్నవి అందులో బేచిరాక్ ఖండ్రికలు ఉన్నాయి మెయిన్ ఖండ్రికలు ఉన్నాయి వేమవరం ఖండ్రిక అని ఒక ఊరు ఉన్నది అది జిరాయితీ ఊరు ఖండ్రిక అగ్రహారం క్రింద ఒకప్పుడు ఇచ్చిన ఊరు ఇప్పుడు దానికి అన్వయం అవుతుందా అన్న సమస్య వస్తుంది వేమవరం గ్రామం ఇనామ్ విలేజ్ కాదు. వేమవరం ఇనామ్ విలేజ్ అని ఏనాడు లిస్టులో వ్రాయలేదు ఇప్పుడుకూడ వాటిని ఇనాము గ్రామాలుగా వ్రాయలేదు కాని దానియొక్క డీడ్ చూస్తే, అది ఇనామ్‌గా వస్తున్నది అట్లాంటిది ఇనాం విలేజెస్‌లో లేకపోతే చిక్కు వచ్చిందనేది ఒక ఉదాహరణ అయినది అటువంటి ఊళ్ళు ఇంకా కొన్ని బయటపడటానికి అవకాశం ఉన్నదని అనుకొంటున్నాను. ఈ పరిస్థితులలో మనం ఏమి చేయాలో ఆలోచించవలసి ఉన్నది ఈ బిల్లువల్ల సమస్యను పూర్తిచేశామని నేను అనుకోవటం లేదు క్లాజు బై క్లాజు చర్చ సందర్భంలో నేను మాట్లాడుతాను. జనరల్ ఇంప్లికేషన్స్ విషయం వచ్చినపుడు, యీ బిల్లులో ఇట్లాంటి అన్వయం చేయాలని ప్రభుత్వాన్ని కోరుతూ ముగిస్తున్నాను.

*శ్రీ వి. శ్రీరామ్మూర్తి: అధ్యక్షా, ఇనాములు రద్దుకావాలని అందరము కోరుతున్నాము. ఎస్టేటు పదముయొక్క నిర్వచనంక్రింద వస్తేనే ఆ ఇనాములు రద్దు అవుతాయి. ఆ విధంగా రద్దుకాకుండా ఉండిపోయిన ఇనాములు యీ పద నిర్వచనంక్రిందకు రావాలని కోరుతున్నాను. దీనికి సంబంధించిన ఒక రకమైన సవరణను ప్రభుత్వం తరఫున ప్రతిపాదించారు. ఆ సవరణ పూర్తిగా సమగ్రం కాదని, అది సరిపోదని నేనుకూడా అభిప్రాయపడుతున్నాను. కొంత మంది మిత్రులు కొన్ని సవరణలు ప్రతిపాదించటం జరిగింది. ఎస్టేటు ప్రాంతంలో ఉన్నటువంటి ప్రతి ఒక్క ఇనాము ఎస్టేటు పద నిర్వచనంక్రిందకు తీసుకువచ్చేందుకు ప్రభుత్వము పూనుకోవాలి. ఆ విధంగా తీసుకురాకపోతే, సమస్య సమగ్రంగా పరిష్కారం కాకుండా వివాదాలకు అవకాశం కల్పిస్తుందని మాకు స్థిరమైన అభిప్రాయం ఉంది. ఎప్పుడో వివాదాలు వస్తాయనే కాదు ఇప్పటికే వివాదాలు వచ్చి, కోర్టులలో తీర్పులు అనేక రకాలుగా వచ్చిన పరిస్థితి ఉన్నది. కోర్టుల తీర్పులు వచ్చినప్పుడల్లా ప్రభుత్వం సవరణలు తేవలసిన అవసరం కనబడుతున్నది. ప్రభుత్వం సవరణలు చేసినప్పుడల్లా కోర్టులో తీర్పులు వేరుగా వస్తున్నాయి. కాబట్టి యీ విషయాన్ని మనం సమగ్రంగా పరిశీలన చేయాలి. "అవసరమైతే తిరిగి ఇంకొక సవరణ తర్వాత ప్రతిపాదిస్తాము" అని మంత్రిగారు చెప్పారు. ఎప్పుడో అవసరమైతే సవరణను ప్రతిపాదిస్తామని మంత్రిగారు చెప్పినందువల్ల, ఇప్పుడు ప్రతిపాదించిన సవరణవల్ల యీ సమస్య ఏవిధంగాను పరిష్కారం కాదని వారే అంగీకరించినట్లు స్పష్టంగా తెలుతోంది. ఆచరణలో ఏర్పడుతున్న ఇబ్బందులను తొలగించుటకొరకు ప్రతిపక్షంవారు తీసుకువచ్చిన సవరణను మంత్రిగారు ఆమోదించాలని కోరుతున్నాను. ఎస్టేటు ప్రాంతంలో ఉన్నటువంటి ప్రతి ఇనాము ఎస్టేటు పదనిర్వచనంలోకి వచ్చేదానికి తగినటువంటి ఆస్కారము కల్పించాలని కోరుతూ సెలవు తీసుకొంటున్నాను.

*శ్రీ పి. రాజగోపాలనాయుడు (తవనంపల్లి): అధ్యక్షా, క్రిందటి దినము మంత్రిగారు మాట్లాడుతూ యీనాం గ్రామాల విషయములో యికముందు ఏవిధమైన తగాదాలు, వివాదాలు, రాకుండ యీ సమస్య పూర్తిగా పరిష్కారము అయిపొయ్యేందుకు అన్నిగూడ estate క్రిందకు రావటానికి గ్రామాల లిస్టును ప్రకటించాలని మంత్రిగారు చెప్పారు. దీనికి వారు హామీగూడ యిచ్చారు. ఇంకను ఏవైనా రావలసినవివుంటే, అవికూడ రావటానికి మరల యీ చట్టమును సవరించటానికి ప్రభుత్వము వెనుతీయదు అని కూడ చెప్పారు. ఇది చాలా సంతోషకరమైన విషయము. అయినను ప్రస్తుత పరిస్థితినిబట్టి చూస్తే యింకను కొన్ని గ్రామాలు ఉన్నట్లు కన్పిస్తున్నవి. అవి కోర్టులద్వారా estate క్రిందకురావు అని తీర్పులు రావటానికి అవకాశము ఉన్నది. అవి ఎక్కడెక్కడ

వున్నవో తెలుసుకోటానికి కోర్టులద్వారా తీర్పులు రాకముందే ప్రకటించడము మంచిది అవి వుండేటట్లయితే, వాటినికూడ యీ Section 3 (ii) (d) క్రిందకు వచ్చేటట్లు చేయటానికి ముందుగా ప్రయత్నించడము మంచిది ఇంకను ఉన్నవని సభ్యులద్వారా తెలుస్తున్నవి గనుక, అవిగూడ వెంటనే రావటానికి సత్వర చర్య తీసుకోమని మంత్రిగారిని కోరుతున్నాను ఆ విధముగ వెంటనే చేయకపోతే యీనాందార్లకు రైతులకు మధ్య మరల తగాదాలు బయలుదేరుతవి అలాంటివి 1956వ చట్టము క్రిందనే ఉండిపోతాయి అప్పుడు యీనాములలో మూడవవంతు ప్రభుత్వము పోగొట్టుకోవలసి వస్తుంది కౌలుదారీ చట్టము ప్రకారము శిస్తు ఈనాందార్లకు ఎక్కువగ పోతుంది కాకపోతే పండిన ధాన్యములో సగమువంతు యీనాందార్లకు చెందవలసివస్తుంది అలాజరిగినప్పుడు చిక్కులుకూడ వస్తూనే ఉంటాయి ఇవి యింకను ఖండ్రిగలుగా ఉండిపోయి రైత్వారీ గ్రామాలకు అనుబంధింపబడి ఉన్నప్పుడు అవికూడ ఎస్టేటు క్రిందకు వస్తాయా రావా అని తేల్చటానికి ఎంతోకాలము పట్టుతుంది అందువల్ల అవికూడ ఏచిక్కులుఅయినా రాకముందే తేల్చివేయమని మంత్రిగారిని కోరుతున్నాను వాటికి సంబంధించిన లెక్కలు అన్ని యిప్పుడే తెప్పించే ఏర్పాటు చేయమని అంటున్నాను అవి యీ శాసనమునకు సంబంధించకపోయినప్పుడు Inam Resumption Act ప్రకారము యీనాందార్లు ప్రభుత్వము క్రింద quit rent తోబాటు ఎంత అయితే శిస్తు చెల్లించవలసియుంటుందో, ఆ శిస్తు చెల్లించవలసి వుంటుంది ఆ శిస్తు మరల రైతు మీదనే పడుతుంది అధికార్లు ఆ శిస్తు వసూలుచేయటానికి ప్రయత్నిస్తారు ఈనాము రైతులు శిస్తులు యివ్వలేకపోతే, మరల జప్తులు వగైరాలు చేసి వసూలు చేయటానికి ప్రారంభిస్తే, రైతులకు యిబ్బంది కలుగజేయడమే అవుతుంది. ఈ శిస్తు ఈనాందార్ల వద్దనుంచే వసూలు చేయాలిగాని, రైతులవద్దనుంచి వసూలు చేయనవసరము లేకుండచేయమని మంత్రిగారిని కోరుతున్నాను

*శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు (నందిగామ) : అధ్యక్షా, ఈ బిల్లు తొందరగా ప్యాసుకావాలనే ఉద్దేశ్యము మాకు కూడా ఉన్నది. అయితే యిప్పుడు మంత్రిగారు బిల్లు ప్రవేశపెట్టిన విధముగ యిది ప్యాసుఅయినంత మాత్రాన మనము యీనాం రైతుల హక్కులు ఏ విధముగ కాపాడాలని అనుకున్నామో ఆ విధముగ కాపాడలేకపోతామని, చాలామంది యీనాం రైతులు యీ బిల్లు యొక్క purview లోనికి రాలేకపోతారేమోననే భయము నాకు కలుగుతున్నందున, అలాంటి యిబ్బంది రాకుండా మేము సవరణలు ప్రతిపాదించడము జరిగింది. మంత్రిగారు యిచ్చిన explanation కు అనుగుణంగానే మేము మా సవరణలను ప్రతిపాదించాము. అసలు యీ బిల్లు

consideration లోకి తీసుకోదలచినప్పుడు కొన్ని ముఖ్యమైన విషయాలను దృష్టిలో పెట్టుకోవాలి ఈనాడు కోర్టులు చేసిన passing remarks క్రింద "such as" అనేదానికి interpretation యిచ్చారు గనుక అది మార్పుచేయుటానికి యీ బిల్లును తీసుకునివచ్చామని అన్నారు. 1956 వ సం లో మనము ప్యాసుచేసిన బిల్లుమీద కూడ కోర్టువారు యింకను కొన్ని passing remarks చేశారు ఈ "such as" అనే మాటలకు యిచ్చిన ప్రాముఖ్యత మిగిలిన passing remarks కు కూడ ఎందుకు యివ్వలేదో మాకు అర్థముకావడము లేదు అందువల్ల వాటిని ఆధారముగ తీసుకుని 1945 సం నుంచి యిప్పటి వరకు వచ్చిన తీర్పులలో, శాసనములలో చేకూర్చిన పదనిర్వచనములకు సంబంధించి, కోర్టువారు యిచ్చిన తీర్పులనుబట్టి దీనిని మార్చటానికి వీలుగా మేము సవరణలు ప్రతిపాదించాము అయితే అవసరమైనప్పుడు మీ సవరణలు అన్నీ consideration లోకి తీసుకుంటాను, అన్ని గ్రామాలు ఆ శాసనం purview లోనికి రాకపోతే, అప్పుడు మీరు చేసిన సూచనలు కూడ దృష్టిలో పెట్టుకుని వేరే amending Bill ను తెస్తానని హామీ యిస్తున్నానుగదా, మీకు వచ్చిన అనుమానము ఏమిటి అని మంత్రిగారు అన్నారు

ఇప్పుడు దాన్ని ఆధారముగ తీసుకుని చర్చ లేకుండ ఎందువల్ల దీనిని ఆమోదించకూడదు అనే సమస్యగా తీసుకునివచ్చి చెబుతున్నారు. దానికి శంకరయ్యగారు కూడ సమాధానము చెప్పారు వేలు, లక్షలు అని చెబితే అంతమంది ఉన్నారో లేరో అని మంత్రిగారికి అనుమానము కలుగవచ్చు ఎవరెవరైతే యీ బిల్లు యొక్క purview లోనికి రాకుండా బాధపడు తున్నారో, యీ బిల్లు యొక్క ప్రయోజనాలను అనుభవించలేకపోతున్నారో, అట్టి యీనాం రైతులందరి పరిస్థితి ప్రభుత్వము కాపాడవలసి ఉంటుంది అది ఎవరు, ఏమిటి అనేది ఆలోచించవలసియున్నది ఒకసారి రైతులస్వాధీనములో ఉన్న భూమి యీనాందార్ల స్వాధీనములోనికి చేయిజారిపోయినట్లయితే అది తిరిగి రైతుల స్వాధీనము చేయటానికి ఎంత కష్టమో, దానికి ఎన్నో సంవత్సరాలు, యుగాలు కూడ పడుతుంది గనుక ఆ విషయములో ఉండే కష్టము మంత్రిగారికి నేను వేరే చెప్పనక్కరలేదు. ఆ భూమి తిరిగి రావడము దుర్లభమే నని గుర్తించాలి. అందువల్ల మేము యీనాడు యిచ్చిన సవరణలు అన్నీ తక్షణమే చర్చించవలసిందిగా కోరుతున్నాము. ఈ సవరణలు సెలెక్టు కమిటీ stage లో చర్చించటానికి వీలులేకపోయింది గనుక యిప్పుడైనాసరే వాటిని consider చేస్తామని అంటే, వాటికేమీ అభ్యంతరములేదు. ఇవి అన్నీ consider చేసి యీ బిల్లులో చేర్చటానికి ఏమాత్రము జాప్యము కూడ అవసరములేదు. మన మందరము యీనాం రైతుల ప్రతినిధి యొక్క హక్కులు కాపాడాలని,

వాడి కోర్కెలు అన్నీ నెరవేర్చాలని అనుకుంటున్నాము గనుక, వారికి ఉండే పరిస్థితులు యితర రైతులకు వుండే పరిస్థితులు అన్నీ common గానే వుంటాయి గనుక, మనము అవి తేలికగానే యీ సవరణల ద్వారా నెరవేర్చగలుగుతాము గనుక, యీ సవరణలు కూడ బిల్లులో చేర్చమని కోరుతున్నాను దానికి అవకాశము కూడ లేకపోలేదు ఈనాడు యీ చట్టము చేసేటప్పుడు మనము కొన్నికొన్ని చిన్నచిన్న మార్పులు గనుక, వీటిద్వారా ఈనాం రైతుల కష్టములు అన్నీ తీరిపోతాయి అంటున్నారు ఈనాం రైతుల హక్కులు కాపాడటానికి, తగిన రక్షణ కలుగజేయటానికి తగినహామి నేను యిస్తున్నానుగదా అని మంత్రిగారు చెబుతున్నారు అయినను ఆ హామీని యిప్పుడు మేము అంగీకరించినప్పటికినీ, రేపు కోర్టుకు పోయేటప్పటికి ఏమి అవుతుందంటే, మంత్రిగారు యిచ్చిన హామీ యిక్కడ Assembly లోనే ఉండిపోతుంది కాని యీ బిల్లు శాసనము అయి బైటికిపోగానే దీనికి వ్యతిరేకముగ జడ్జిమెంట్లు రావడముకూడ జరుగుతుంది మేము దానికి మరల సవరణలు తెచ్చేటప్పటికి నేడు చెప్పిన వేలో, లక్షలో, కోట్లో అయిన యీనాం రైతులు మాత్రము యిబ్బందులపాలు అయిపోయి, బాధపడడము జరుగుతుంది ఇదిఅంతా రాకుండా మేము యీ సవరణలు సూచిస్తున్నాము రేపు ఎప్పుడో దీనికంతటికి టైము waste చేసేబదులు, యీనాం రైతులను యిబ్బందిపాలు చేసేబదులు ఆ కాస్తటైముకూడ యిప్పుడే తీసుకుని, మరల చీటికిమాటికి సవరణలు ప్రతిపాదించడము, ఆమోదించడము, ఆమోదించకపోవడము యిది అంతా చేసేబదులు, యిది ఒకేసారి సమగ్రమైన బిల్లుగా ప్యానుచేస్తే మంచిది రేపటిరోజున మరల యీ విధానము, కార్యక్రమము నడిపించబోతే, ఆనాడే తీసుకుని ఆమోదించినట్లైతే, యీ trouble అంతా లేకుండా పోయేదిగదా అని అనిపించవచ్చు ఇంకొక విషయము ప్రధానంగా మంత్రిగారిదృష్టికి తీసుకొని రాదలచుకున్నాను 1936 తరువాత 1945 చట్టమును inam legislation క్రింద ఒక land mark గా తీసుకో వచ్చు అందులో ఉండే definition కూడ తీసుకుని దానితరువాత కంద్రిగలు, శివార్లు రావడములేదు గనుక 1956 వ సం॥ పు చట్టములోని వాటిని తీసుకుని వస్తున్నాము అని చెప్పుతున్నారు అయితే 1945 లో ఉన్న చట్టములోనే కొన్ని పదములమీద హైకోర్టువారు interpret చేస్తూ తీర్పుయిచ్చారు దానివల్ల వేలకొలది యీనాం రైతులకు భూమిమీద హక్కులేకుండా పోతున్నది ఆ విషయములో చిక్కులన్నీ యల్లమందా రెడ్డిగారు, శంకరయ్యగారు మంత్రిగారికి తమ ఉపన్యాసములో తెలియజేశారు. ముఖ్యమైన విషయాలు మంత్రిగారి దృష్టికి తీసుకొనివస్తాము. 1945 వ సం॥పు Act లో "The subject matter of

the grant shall be deemed to be an Estate, not withstanding that it did not include certain lands" అని ఉన్నది ఈ "certain lands" అనేదానికి ఏమి అర్థం? దానికి ప్రధానమైన contest చేస్తున్నారు మంత్రిగారు any land అంటే ఏ భూమిఅయినా అని చెప్పవచ్చుననియు అంటున్నారు కాని ఏ భూమి కాదని చెప్పడానికి కోర్టుకు అవకాశము ఉంటుంది

కాని ఆ పదాలన్నీ 1956 amendment లో వున్న విధంగానే అట్టే పెట్టినప్పుడు వచ్చేటటువంటి ఫలితం యేమిటి? దానిని మార్చవలసిన అవసరం వుందా లేదా అనే విషయాన్ని పరిశీలించవలసిన అవసరం వుందని చెబుతున్నాను అందువల్ల ఈ certain అనే మాటకు మనం ఏ అర్థం యీయదలచుకున్నామో దానిని ఖచ్చితముగా తీసుకువచ్చి, ఈ amending Bill లోనే incorporate చేస్తే బాగుంటుంది అంతేకాని మళ్ళా ఈ certain lands అనే పదం 1956 amendment లోకో 1957 amendment లోకో వచ్చిన తరువాత కూడా అదేవిధంగా వుండేటట్లయితే దానిమీద కోర్టులు తమ యిష్టం వచ్చిన తీర్పులు చెప్పడానికి అవకాశం యిస్తాం మనం శాసనం చేసేటప్పుడు యెంతవరకు శాసనమును fool-proof గా అట్టే పెట్టడానికి వీలుంటుందో అంతవరకూ పెట్టడానికి ప్రయత్నం చేయాలి. దీనిలో యీ certain lands యొక్క definition యేమిటి? రేపు యే హైకోర్టు జడ్జి అయినా సరే, సబ్ కోర్టు జడ్జి అయినా సరే మునసబయినా సరే యల్లయ్యకు పుల్లయ్యకు వున్నటువంటిదనికాని, ఫలానా సరిహద్దులలో వున్నటువంటిదని గాని, ఫలానా చెట్టు క్రింద వున్నటువంటిదనికాని నిర్వచించి అది 'certain lands' అనే దానికి వర్తిస్తుందనే నిర్వచనం యిచ్చినప్పుడు దానిమీద ఎంతమంది రైతులు నష్టపోతారో మనం ఆలోచించాల్సిన అవసరం వుంది. Department వారు, "ఇదివరకు వీటిమీద యిలాంటి తీర్పులున్నాయి ఈ తీర్పులవల్ల 1954 Act యీ విధంగా తూట్లు పొడవబడింది దీనిని మనం సవరించాలి" అనే విధంగా సమగ్రమైన శాసనం తీసుకురావడం యింతవరకు మనకు అలవాటు కావడం లేదంటే ఆశ్చర్యం లేదు. కారణంమాత్రం ఆలోచించవలసి వున్నది ఈ certain lands కు సంబంధించినంతవరకు దాని నిర్వచనం యేమిటి? Judges వారి యిష్టం వచ్చిన interpretation యివ్వడానికి అవకాశం కల్పిస్తున్నామా లేదా? ఇనాందారులను రైతులను కోర్టులచుట్టు త్రిప్పి వాళ్లడబ్బు ప్లీడర్లకు ముట్టేట్టుగా చేస్తున్నామా లేదా అనే సమస్యవుంది, అంతేకాకుండా "and which has already been granted" అని ఉంది. "Already granted" అనేదానివల్ల రెండు ఇబ్బందులున్నాయి. వకీళ్లందరికీ తెలుసును. Burden of proof ఇనాందారుపై లేదు. రైతులమీద పెడుతున్నారు. సనదులేక, పట్టాలేక, grant లేక ఏకాగితం

లేనప్పుడు ఇనాందారు prove చేసుకోలేడట! రైతు మాత్రమే ఏకాగితం లేకుండా కోర్టులకు పోయి రుజువు చేసుకోనాలట! దీంట్లో యేమి న్యాయం వుందో ఆలోచించాలి న్యాయంలేదని మనమందరమూ అంగీకరించినట్లయితే యీ defect ను ఎట్లా సవరించాలి? "Already" అని ఎట్లా రుజువు చేసుకుంటాడు? వందల సంవత్సరాల క్రిందట జరిగిపోయిన ఘటనను యీనాడు రైతు ఏ విధంగా రుజువు చేసుకోగలడు? మార్గాలు మనం యేమయినా సూచించామా? దీనిద్వారా యేమయినా protection యిస్తామా? పోనీ Burden of proof ఇనాందారుల మీదికి నెట్టడానికి సిద్ధంగా వున్నామా? అందుకు అవసరమైన amendment పెడతారా అనేటటువంటి సమస్య యీ రోజున మాకుంది. దీని విషయంలో మేము నిపుణులం కాకపోవచ్చును, మేము హైకోర్టులలో, జిల్లా కోర్టులలో practice చేయకపోవచ్చు, ఉన్నటువంటి పుస్తకాలను చదువుకుని ప్లీడర్లతో సంప్రదించి అనుభవంలో వున్న defects యివని తెలుసుకున్నాం" నిన్న శ్రీ శంకరయ్యగారు చల్లాయిపాలెంలో జరిగిన సంఘటన చెప్పారు. జడ్జిమెంటులోని విషయాలు వివరించడం జరిగింది శ్రీ వెంకటరావుగారు "Judgment నాకియ్యండి ఇప్పుడైన పరిశీలన చేస్తాం" అన్నారు ఆ కాపీ వారికి పంపించడానికి సిద్ధంగా వున్నాము. "Already granted" అనే అంశం మీద వివాద గ్రస్తమైన తీర్పు లున్నప్పుడు దానిని సవరించకుండా అదేవిధంగా carry out చేసినట్లయితే మనం యే వుద్దేశ్యం నెరవేర్చాలనుకున్నామో ఆ వుద్దేశ్యం నెరవేరదని స్పష్టంగా బోధపడుతున్నది Explanation (1) లో చివర "Hamlet or Khandrika which has already been granted on service or other tenure reserved for communal purposes" అని చెప్పారు ఈ purposes కాకుండా యింకాకొన్ని వున్నాయి జమీందారో ఇంకెవరో తన private land గా కొంతభూమిని పెట్టుకుంటాడు. దానిని వేలంవేసి అమ్ముతాడు, అది రైత్వారి విలేజిగా turn అయిపోతుంది అది దీంట్లో చేరదని స్పష్టంగా ఒక తీర్పు యిదివరకే వుంది ఈ 1956 Amending Act పై కూడా శ్రీ లచ్చన్న గారు చెప్పినట్లు వేరే తీర్పు రానక్కరలేదు ఈ పదంమీద యిదివరకే తీర్పు యివ్వబడింది "How are you going to by-pass it? How are you going to meet that point?" అనేటటువంటి విషయం మంత్రిగారు ఆలోచించాలని చెబుతున్నాను. ఇది లేకపోతే actual గా ఒక తీర్పు వుంది దానివల్ల యినాం రైతులకు నష్టంవచ్చింది దానిని పరిష్కారం చేయండి, సవరించండి అని విజ్ఞప్తి చేస్తున్నాం. ప్రధానంగా 1945 Act 1955 Act లలో వచ్చినటువంటి భేదం, 1957 లో మనం చేసినటువంటి amendment ఫలితం

చూచుకున్నపుడు hamlet లు khandrika లు తప్ప మిగిలిన issues మీద యినాందారులను రక్షించడానికి జడ్జీలు 1945 Act కు పొడిచిన తూట్లు plug చేయడానికి మనం యే విధంగానూ పూనుకోలేదు 1956 Amending Act అందుకు ఉపకరించలేదు మంత్రిగారికి విషయాలు క్రొత్తవని కాదు వారికి తెలిసిన విషయాలే అయినప్పటికీ మా కర్తవ్యం మేము నెరవేర్చాలి వందల మందయినా ఎంత మందయినా సరే న్యాయంగా ఎవరెవరికి ఏ హక్కు ఉండాలని నిర్ణయించలేక పోతున్నాం ఇదయిపోయిన తరువాత మంత్రిగారు తప్పకుండా చేస్తారనే విశ్వాసం శ్రీ లచ్చన్నగారికి వుండవచ్చు నాకుకూడా విశ్వాసం వుందని చెప్పమంటే చెప్పవచ్చు కాని అన్నిటికన్నా ముఖ్యమైన దేమిటంటే, ఈ లోగా రైతులకు జరిగే అన్యాయాన్ని అరికట్టే మార్గం యేమిటి ? శ్రీ శంకరయ్యగారు చెప్పిన చల్లాయిపాలెం వంటి 80 గ్రామాల లోని రైతుల చేతులలోనుంచి వారి permanent tenancy rights, occupancy rights యీ చట్టం మంజూరు అయిన వెంటనేపోకుంటే యేమీ చేత కాకుండా కూర్చోవడం సరైన విషయం కాదు అందుచేత దీనిని సవరించాల్సిన అవసరం వుంది. వేరె Amending Bill అవసరం లేకుండానే దీనిని వాయిదా వేసి తరువాత సవరించినా బాగుంటుందని మంత్రిగారికి సూచిస్తున్నాను

* శ్రీ ఎస్. కె వి. కృష్ణావతారం (తాడేపల్లిగూడెం-జనరల్) అధ్యక్షా, మంత్రిగారు తెచ్చిన Amending Bill ను బలపరుస్తున్నాను. Estate అనే పదాన్ని నిర్వచనం చేయడంలో కొంత లోపంవుందనీ, ఆ లోపాన్ని సవరించే నిమిత్తం యీ Amending Bill ను ప్రభుత్వం తీసుకురావడమైనది 'Estate' అనే పదం యొక్క నిర్వచనం మొదటిలో Act II of 1908 లో Estate Land Act pass అయినప్పటి నుంచీ ఎప్పటికప్పుడు కాలానుగుణంగా భావాల యొక్క మార్పుల కనుగుణంగా విస్తరింప జేస్తూ రావడం అందరకూ తెలిసిన విషయమే మొదట్లో ఒక మేలువరం మాత్రమే యినాముగా యివ్వబడినచోట "To a person not owning kudiwaram" అని కుడివరము యొక్క హక్కును కూడా యినాం దారుకు యివ్వని cases లో మేలువరం హక్కు మాత్రమే (అంటే right to collect rent మాత్రమే) వున్న cases లో అది estate గా నిర్వచనం చేయడమైనది దరిమిలా 1936 వ సంవత్సరంలో "any inam village of which the melwaram has been granted to a person not owning the kudiwaram" అనేది omit చేసి "of any inam village" అని రెండు వరములు కూడా యినాందు యివ్వబడినప్పటికీ కూడా వాటిని Estate Land Act యొక్క Section 3 (2) (d) నిర్వచనంలోకి తీసుకువచ్చి Estate Land Act యొక్క భూమిదారులను ఆ రైతాంగానికి అంద జేసేటట్లు సవరణ తీసుకురావడం జరిగింది

1945 వ సంవత్సరంలో తిరిగి ఆ Act లో కొన్ని పొరపాట్లు ఉండడం వల్ల దానిని Estate Land Act యొక్క Section 3 (ii) (d) ని పద నిర్వచనాన్ని మళ్లీ నిర్వచనంచేయడం జరిగింది ఆ పదంలో "village" అంటే village లో కొంత private land గా గాని, Service inams గాని ఏదయినా యిచ్చినప్పటికీ కూడా లేకపోతే యినాం యిచ్చేటప్పుడు కొంత reservation వున్నప్పటికీ కూడా, అంతమాత్రంచేత అది 'whole inam village' కాకుండాపోదు అనే టటువంటి నిర్వచనాన్ని అప్పుడు తీసుకురావడం జరిగింది దరిమిలాను తిరిగి మనం 1956 వ సంవత్సరంలో ఆంధ్ర అసెంబ్లీలో Section 3 (ii) (d) నిర్వచనాన్ని విస్తృతంచేస్తూ pass చేశాము అప్పుడు hamlet గాని, ఖండ్రిక గాని యినాం క్రింద యివ్వబడినట్లయితే అది కేవలం hamlet అయినంతమాత్రాన. కేవలం ఖండ్రిక అయినంతమాత్రాన అది whole inam కాకపోయినప్పటికీ కాలేదనేటటువంటిదాని యొక్క యిబ్బందిని తొలగించే నిమిత్తం, 'hamlet గాని, ఖండ్రిక గాని యినాం క్రింద యివ్వబడినట్లయితే' అది Section 3 (ii) (d) నిర్వచనం క్రింద వస్తుందని pass చేయడం జరిగింది

ఈ బిల్లును మనం ఆలోచించేటప్పుడు, ఈ బిల్లుకు సవరణలు తెచ్చేటప్పుడు అవి ఈ బిల్లు scope క్రిందకు వస్తాయా ? రావా ? అనే విషయమును ఆలోచించవలసివుంది అనవసరమైన amendments తీసుకువచ్చి బిల్లును తల క్రిందులు చేయరాదు మొదటిలో 'in such an inam village' అని వున్నప్పుడు కొంతమందికి doubt వుండేది అప్పుడు ఆ నిర్వచనాన్ని విస్తృతము చేయాలని amendment తీసుకురావటం జరిగింది దానివలన 'కండ్రిగ అయినా, హామ్‌లెట్ అయినా ఈనాము అయివున్నట్లయితే అది రెవెన్యూ ఎకౌంట్సులో ఈనాము క్రిందే పరిగణించబడియుంటేరైతువారీ గ్రామమునకుగాని, జమీందారీ గ్రామమునకుగాని అది చెందినప్పటికిని దానియొక్క character ఈనాం గనుక అది ఈనాం క్రింద పరిగణింపబడుతుంది' అని అన్నారు సెక్షన్ 3 (ii) (d) నిర్వచనము వచ్చినట్లయితే ఈనాం ఎస్టేటు క్రింద పరిగణించటంవల్ల ఆ రైతుకు ocupancy rights, rent reduction మొదలైనవి వర్తిస్తాయి Abolition Act క్రింద ఈనాందారుకు compensation ఇవ్వటం జరుగుతుంది రైతువారి ఇెన్యూరర్ గా మార్చటం జరిగింది ఇది amendment Bill అయినప్పటికి 3 (ii) (d) నిర్వచనం క్రింద చాలా ఫలితాలువున్నాయి దీనివల్ల రైతాంగానికి చాలా మేలు జరుగుతుందని నేను అనుకొంటున్నాను 'any Inam village' అనే పదాన్ని omit చేసి ఏ ఈనాం అయినప్పటికినీ ఎస్టేటు లాండు ఆక్టుకు వర్తింపచేసే ఉద్దేశము ప్రభుత్వానికిలేదు దానివల్ల మైనర్ ఈనాం ఎస్టేటు లాండుయాక్టు క్రిందకురావటానికి అవకాశము వుంటుంది 1956 లో చేసిన amendment లో వున్న లోపాలను సవరించి ఈ Amending Bill ను మన రెవెన్యూ మంత్రిగారు తీసుకురావటం

చాలా ప్రశంసనీయమైన విషయము ఇందులో కూడా ఏమైనా లోపములు వున్నట్లయితే, వాటిని సవరించే నిమిత్తము వేరే బిల్లును తీసుకువస్తానని రెవెన్యూ మంత్రిగారు హామీ ఇచ్చారు మనం ఈ బిల్లును వెంటనే pass చేసినట్లయితే, దీనియొక్క ఫలితాలను రైతాంగానికి అందచేసినవారమౌతాము కనుక వెంటనే pass చేయాలని కోరుతూ ఇంతటిలో సెలవు తీసికొంటున్నాను

* శ్రీ కె వెంకటరావు అధ్యక్షా! ఈ బిల్లుకు సంబంధించిన విషయాలకు అయివున్నట్లయితే, శ్రమపడి అయినా, ప్రతి point కు సమాధానం చెప్పవలసి ఉండేది దేశాన్ని ఎలా మరమ్మతు చేయాలనే విషయంపై వున్న భావాలన్నీ ఈ drafting amendment లో తీసుకురావటంవల్ల వాటికి నేను ఇక్కడ సమాధానం చెప్పటం న్యాయంకాదని అనుకొంటున్నాను కొన్ని ఉద్దేశ్యాలతో ఈ inam estates చేస్తున్నామని సభ్యులు చెప్పటం జరిగింది. గతవారం చర్చించి మనమందరి ఆమోదంతోటి శాసనం చేశాము కనుక ఈరోజు ఈ చర్చ 15 నిమిషాలలో ముగుస్తుందని అనుకొన్నాను కాని మొన్న pass చేసిన amendment ను మళ్ళీ చర్చకుపెడితే ఇంతసేపు చర్చ నడుస్తుందని అనుకోలేదు, కొన్ని amendments ఇంటికి పంపించారు. కొన్ని ఇక్కడ ఇచ్చారు ఇంతవరకు జరిగిన చర్చ అంతావింటే ఆదర్శపూర్వకమైన చర్చలోనికి గౌరవసభ్యులు దిగారు కాని ఈ బిల్లుకు సంబంధించిన విషయాలపై వారు దృష్టిని కేంద్రీకరించలేదు 1908 లో మద్రాసురాష్ట్రములో ఈనాములు ఎస్టేట్లు చేయాలనే సంకల్పం కల్గింది అన్ని ఈనాములను కాకుండా ఒక రకమైన ఈనాములనే ఎస్టేట్లు చేశారు దానిపై కోర్టువారు జడ్జిమెంటులు ఇవ్వటం ప్రారంభించారు 1936 లో దానిని విస్తృతపరిచారు. అప్పటికి జడ్జిమెంటులు వస్తే 1945 లో యింకోసవరణ పెట్టారు. ఆ సవరణపై ఆధారపడి 1948 లో కొన్ని ఈనాములను రద్దుచేయటం కొన్ని ఈనాములను రద్దుచేయకపోవటం జరిగింది. అలా వదలిపెట్టబడిన ఈనాములన్నిటిని కర్నూలులో వుండగా మనం రద్దుచేశాము, whole inam village అనే మాటక్రింద కొన్నిగ్రామాలు బైటకు పోయాయి అనేదృష్టితో వాటినికూడా వీటిక్రిందకు తీసుకువచ్చే ప్రయత్నం జరుగుతున్నది. ఇంతవరకు మిత్రులు చదివిన జడ్జిమెంటులు, వ్యాఖ్యానాలు, 1956 లో సవరణ పెట్టటానికిముందు వచ్చినవి. కాని వచ్చిన ప్రతి జడ్జిమెంటుమీదా ఒక amendment బిల్లు తీసుకువచ్చే స్థితిలో ఈ ప్రభుత్వము లేదు. ఎక్కువమందికి ఏ అపకారము జరుగుతున్నదో, అటువంటి సందర్భములో ప్రభుత్వం సవరణ తీసుకువస్తుంది. కాని కోర్టులయొక్క ప్రతి జడ్జిమెంటుకు సమన్వయము అయ్యే amendment తీసుకురాలేదు. ఒక పద ప్రయోగము. అనుమానాస్పదముగా వుందనే భావం కలగటంవల్ల దానిని

దిద్దుబాటు చేయాలనే ఉద్దేశ్యంతో ఇది జరుగుతోంది ఈ ఉద్దేశ్యాన్ని సభవారు ఆమోదించారు. ఈవేళ కొత్తవిపెడితే Abolition Act కు మళ్ళీ amendments పెట్టాలి సమగ్రాసమగ్రముల నిర్ణయము ప్రతిరోజు వచ్చే కోర్టు జడ్జిమెంటుల మీద వుంటుంది ఈ మిత్రులు తెచ్చిన amendments అన్నీ నేను ఒప్పుకొన్నా కోర్టువారి జడ్జిమెంటు ఇంకోవిధంగా వస్తుంది మనిషి జీవితంవలెనే రాజ్యాంగము యొక్క జీవితంకూడా, నిరంతరము ప్రవాహమువలె నడుస్తూ వుండాలి

ఇప్పుడు యిందులో మనంచేసే చర్యలయొక్క ఫలితం మనం అనుకొన్నట్లుగా లేకపోతే—నేను underline చేసి మళ్ళీ చెబుతున్నాను ఇప్పుడు మనం చేసే చర్యలయొక్క ఫలితం మనం అనుకొన్నట్లుగా లేకపోతే మళ్ళా సమగ్రంగా ఆలోచించి అవసరమైన సవరణలను తీసుకువస్తాను కోరే ఫలితం అంతా రాదని నాకూ తెల్సును అన్నివిషయాలలోనూ కోరేఫలితాన్ని ప్రభుత్వం అంగీకరించడంలేదు ఎన్ని judgments ను చదివినా, కొన్నిలిస్టులతో ఎన్ని amendments పెట్టినా మనం అసలు ఉద్దేశం మార్చుకుంటేనేగాని ఎస్టేటులయ్యే గ్రామాలు లేనేలేవు అందువల్ల అన్నింటికీ ఒకటే అనేమాటకు అర్థంలేదు మొత్తంమీద ఎస్టేట్ల స్వభావం అని మనం అనుకొన్నదానికి సందర్భించి నిర్ణయంలోకి తీసుకురావడానికి యింతవరకు జరిగినదాంట్లో మాటలలోగాని, వాక్యాలలోగాని, High Court వారిచే interpretations లో గాని ఏమైనా తేడాలుంటే నేను మళ్ళా ఆలోచించి అవసరమైన సవరణలను తీసుకువస్తానని చెబుతున్నాను ఎన్నిసార్లు చర్చలుచేసినా నేనీవేళ చెప్పగలిగిన సమాధానం యిదే Scope of the Bill కు మించి amendments వస్తే మాత్రం ప్రభుత్వంతరఫున నేను అంగీకరించే పరిస్థితిలో లేను. Drafting amendment వంకపెట్టి ప్రపంచంలోవున్న అన్ని విషయాలను, మనస్సులో ఉన్న అన్ని భావాలనుకూడా దీంట్లో క్రోడీకరించి ఈ వ్యవహారాన్ని ఈవేళతోనే పూర్తి చేయాలనే ఉద్దేశ్యం ప్రభుత్వానికి లేదు. ఇంకా ఏమైనా చేయవలసి వస్తే ప్రభుత్వ ధర్మం ప్రభుత్వానికి తెలుసు ఈనాం రైతులు ప్రభుత్వానికి ప్రతిపక్షం వారు (opposition) కారు వారు ప్రభుత్వానికి సంబంధించినవారే ఇప్పుడు నేను చెప్పినపద్ధతులవల్ల ఏమైనా అపకారం కల్గినట్లయితే, సవరించడానికి ఈ ప్రభుత్వం సంకల్పించుకుంది, సంకల్పిస్తుంది, సాధించి తీరుతుంది కాని ఉన్న అన్ని ఆదర్శాలనూ ఒక బిల్లులోనికి తీసుకురావలసిన బాధ్యత ప్రభుత్వంమీద పడింది కనుక ఆ clause ను, ఆ wording ను మొన్న మనం pass చేసి, మళ్ళా దానికి యింకొక భావాన్ని తీసుకొనివచ్చి ఈవేళ amendment పెడితే-ఆమోదించడం ప్రభుత్వానికి న్యాయయోగ్యం కాదుగనుక, ఆమోదించడం

సాధ్యంకాదు కాని, కొన్ని విషయాలు యోచించ దగినవిగా ఉన్నాయి వాటిని, నాయోచనకు, ప్రభుత్వ యోచనకూ వదిలిపెట్టి ముందురాబోయే వ్యవహారానికి దానిని సమన్వయం చేసుకొనవలసినదిగా నా కోరిక అంతే కాని, ఇప్పుడు drafting amendment తోపాటు ప్రపంచంలోవున్న సర్వలోపాలనూ, జడ్జిమెంటులనూ సమన్వయం చేసే ఉద్దేశం ప్రభుత్వానికి లేదు. ఇది సంకుచిత మైన, పరిమితమైన amendment దీనిని పరిమితంగానే pass చేయాలి కాని విస్తృతం చేసి దీనిని అవకాశంక్రింద తీసికొని, యింకొక రకంగా చేయుటకు, అంగీకరించుటకు వీలులేదని మనవిచేస్తూ నేను శలవు తీసుకుంటున్నాను

మిస్టర్ స్పీకర్ ఇప్పుడు 'That the Bill be referred to Select Committee అనే amendment ను move చేయలేదు కాబట్టి అసలు బిల్లు తీసుకుందాము

The question is

"That the Bill be taken into Consideration"

The motion was adopted

*Clause 2*

*Sri. K. Venkata Rao* I beg to move·

In line 3 of the Sub-clause (ii) of clause 2 of the Bill for the words 'in Inam' substitute the words 'as an Inam'.

"In inam" అనేదానికి బదులు "as an inam" అని ఒక amendment ను మొన్న ఒప్పుకున్నాము Opposition వారు కావాలంటే ఇప్పుడు అంగీకరించ డానికి నాకు అభ్యంతరం లేదు

***Mr. Speaker*:** The question is

"That in line 3 of the Sub-clause (ii) of clause 2 of the Bill for the words 'in Inam' substitute the words 'as an Inam'.

The motion was adopted.

మిస్టర్ స్పీకర్ : మొన్న Abolition Bill లో మంజూరు అయినవాటికి మించి ప్రభుత్వంవారు ఇంకేమీ ఒప్పుకోవడంలేదన్నమాట. Clause 2 కు కొన్ని amendments వచ్చాయి. అందులో మొదటి amendment సుందరయ్యగారిది.

శ్రీ పి. సుందరయ్య (గన్నవరం) : నా amendments అన్నీ కూడా...

మిస్టర్ స్పీకర్ మీ amendments అన్నీ ఇప్పుడు చెప్పవద్దు ఒక్కొక్కటే తీసుకుందాము మీరు అన్నీ ఒక్కసారి తెచ్చి నన్ను confuse చేయదలచుకున్నా నేను మాత్రం confuse అవదలచుకోలేదు

*Sri P Sundarayya* I beg to move

Add the following new sub-clause as sub-clause (i) of Clause 2

"(i) In sub-clause (ii) of sub-clause (d), omit the words 'in an Inam village' after the words 'any hamlet or Khandriga' "

*Mr Speaker* Amendment moved

ప్రభుత్వం ఉద్దేశాలకు మీ amendment కూ ఏమి భేదం ఉన్నదో కలిపి స్తే అప్పుడు ఆలోచిద్దాము

శ్రీ పి. సుందరయ్య అధ్యక్షా, 2 వ Clause కు నేను యిచ్చిన యింకొక సవరణ యిలా ఉన్నది

"In Explanation (1), the words 'in an inam village' in the second place where they occur shall be omitted," అని వున్నది

మిస్టర్ స్పీకర్ · మీకు మొదటిది అక్కరలేదా?

శ్రీ పి. సుందరయ్య నేను బిల్లుకు సవరణ ప్రతిపాదించలేదు Sub-clause (1) కి ముందు ఇంకొక Sub-clause చేర్చాలనేదే నా సవరణ

అంటే 1956 లో చట్టంలోని explanation (1) మార్చడానికి ఒక Sub-clause యిచ్చారు Explanation రాకముందు ఈ బిల్లులో ఇంకో క్లాజు పెట్టాలనేది నా సవరణ Principal Act లోని 3 (ii) (d) కి explanation లోనే ఒక సవరణ పెట్టవలసి యున్నది 3 (ii) (d) అనే క్లాజును మనం యిప్పుడు సవరిస్తున్నాము కాబట్టి ఒక explanation మాత్రమే మారిస్తే చాలదు ప్రభుత్వం ఏ ఉద్దేశంతో draft amendment ద్వారా explanation లో 'in any inam village' అనే పదాన్ని విరమించాలని కోరారో ఆ ఉద్దేశాన్ని నెరవేర్చడానికి కూడా ఒక explanation ను సవరిస్తేచాలదు కాబట్టి explanation లోనే 'kandrika' తరువాత, 'in any inam village' అంటే చాలదు 3 (ii) (d) లో కూడా 'Kandrika' తరువాత 'in any inam village' అనే పదాలను omit చేస్తేనే ప్రభుత్వోద్దేశ్యం నెరవేరుతుంది అందుచేత ప్రభుత్వం పెట్టిన సవరణల లోని object తోనే మేము కొన్ని సవరణలు తెచ్చాము.

మంత్రిగారు కొన్ని సవరణలు తెచ్చారు ఆ సవరణల యొక్క scope లోకే మా సవరణలు కూడా వస్తాయి ప్రభుత్వంవారు ఏ ఉద్దేశముతో అయితే explanation లో 'in any inam village' అనే పదాలను తొలగిస్తున్నారో అదే ఉద్దేశంతో ఈ సవరణను చేయమని కోరుతున్నాను

"any hamlet or khandriga in an inam village, of which the grant as an inam has been made, confirmed or recognised by the Government, notwithstanding that subsequent to the grant, such village, hamlet or khandriga has been partitioned among the grantee, or successors-in title of the grantee or grantees"

అని 3 (ii) (d) (2) లో ఉన్నది దానికి explanation I, IA, IB అని ఉన్నాయి Explanation (1) కు ప్రభుత్వంవారు ఒక సవరణ ప్రతిపాదిస్తున్నారు

మిస్టర్ స్పీకర్ ప్రభుత్వంవారు ఒప్పుకుంటారా ?

శ్రీ కె. వెంకటరావు ఒప్పుకోనవసరంలేదు, నేను ఒప్పుకోవడంలేదు

మిస్టర్ స్పీకర్ ప్రభుత్వం తెచ్చిన సవరణకు, సుందరయ్యగారి సవరణకు భేదం ఏమిటి ?

శ్రీ కె వెంకటరావు దానివల్ల మేము అనుకొన్నదానికంటె scope కొంచెం expand అవుతుంది.

మిస్టర్ స్పీకర్ 1956 Act లో "any inam village or any hamlet or khandrika in an inam village, of which a grant has been made, confirmed, etc" అని వున్నది.

అందువల్ల రెండవదాంట్లో సవరణ పెట్టడం, మొదటిదాంట్లో పెట్టకపోవడం inconsistent కాదా ?

శ్రీ కె. వెంకటరావు . అది inconsistent కాదు మొదటిది ప్రధానంగా estate ను define చేసేది. రెండవది explain చేసేది. "Only in cases of those hamlets where they are at present ryotwari villages but have been once granted as inams" అన్నే idea ను extend చేయడంకోసం చేసిన amendment యిది. అసలు "inam" definition ను extend చేసే ఉద్దేశం లేదు.

మిస్టర్ స్పీకర్ : అయితే, యీ amendments ను ఓటుకు పెడదాము.

శ్రీ పి సుందరయ్య ముందు నన్ను వివరించనీయండి వివరించ కుండానే ఓటుకు పెడితే ఎట్లా ?

మంత్రిగారి ఉపన్యాసం విన్నతరువాత నా సవరణ గెలుస్తుందనే నమ్మకం నాకులేదు. మేము యిచ్చిన **amendments** లో కొన్ని సబబుగానే ఉన్నాయి, ఆలోచించాలి అని చెబుతూ, **amendment** చేస్తున్నామని చెబుతూ కూడా "ఈ సమావేశంలో ఏమాత్రం కూడా ఆలోచించ దలచుకోలేదు వ్యతిరేకంగానే ఓటు చేయదలచుకున్నాము" అంటున్నారు వారికి మెజారిటీ ఉన్నది కాబట్టి మా సవరణలు ఓడిపోవడం ఖాయం గెలుస్తాయని నాకు భ్రమ కూడా లేదు మంత్రిగారు చెప్పినట్లుగా ఈనాం రైతులంతా కాంగ్రెసుపక్షానికి చెందినవారే కావచ్చు నేను యిప్పుడు ఆ వివాదంలోకి వెళ్ళదలచుకోలేదు. దాంట్లో యిప్పుడున్న చట్టంప్రకారం, **judgments** ప్రకారం సవరణలు పెట్టి నట్లయితే, ప్రభుత్వం ఏ ఉద్దేశంతో 1956 లో **Estate Amendment Bill** తెచ్చిందో ఆ ఉద్దేశాలు నెరవేరడానికి కూడా కొన్ని సవరణలు అవసరమని **Amending Bill** తేవచ్చు కాని ఆ ఉద్దేశం అమలు జరుగడానికి కూడా **consistent** గా **3 (ii) (d) section** కు, **explanation** ను కూడా మార్చవలసి యుంటుంది

ఈ మా సవరణకు వ్యతిరేకంగా ఓటుచేసి ఓడించితే మేము చేయకల్గిం దేమీ లేదు కనీసం మా కర్తవ్యాన్ని ఈ సవరణను ప్రతిపాదించి నెరవేర్చుకో గలము ఇదివరకే చెప్పాము, ఇపుడున్న **Act** లోని లోపాల వల్ల, **judgment** ల వల్ల ఈ చిక్కులు కల్గుతున్నాయి అందుచేతనే వాటిని తొలగించడానికే ఈ సవరణలు ప్రతిపాదించి, మా కర్తవ్యం నెరవేర్చడానికే మేము చూస్తున్నాము కాని ఇక్కడ **pass** ఔతుందనే ఉద్దేశంతో కాదు మంత్రిగారు దానిలో సబబు చూసి ఆమోదించడం ప్రభుత్వం యొక్క ధర్మం "సబబైనా మేము మాత్రం ఆమోదించడంలేదు ఇంకెపుడో ముందు చేస్తా" మనే మాట మాత్రం సరియైనది కాదు అంటె కండ్రిగను కాని, **hamlet** ను కాని ఒక పర్యాయం ఈనాంగా ఇచ్చి వున్నట్లయితే అవి **'estates'** క్రింద వచ్చేదానికోసం ఈ కోర్టు **judgments** వల్ల చిక్కులు వస్తున్నాయి ఆ చిక్కులను తొలగించడానికే నా సవర ణను కూడా ప్రతిపాదించాను అందుచేతనే ఇపుడు మంత్రిగారు చెప్పిన టువంటి సవరణలను ఆధారంగా పెట్టుకొనే, ఈనాం రైతుల హక్కులను కాపాడేదానికే మనం 1956 లో ఆంధ్రరాష్ట్రంలో తెచ్చిన బిల్లు యొక్క ఉద్దేశాన్ని నెరవేర్చేటందుకు, కోర్టులలో దురభిప్రాయాలు కాని, అపోహలు కాని లేకుండా చేసేందుకు **clause (2)** కు **3, (ii) (d)** లోని **Sub-section (2)** కు

కూడా ఈసవరణ పెట్టాలని కోరుతున్నాను అక్కడ కూడా 'in any inam village' అనేదానిని తీసివేయాలని చెప్పాము. ఈ సవరణను చేయటం వల్ల ఈ scope ను విస్తృతం చేస్తున్నామని మంత్రిగారు ఇపుడు చెప్పారు "Any hamlet or khandriga of which a grant as inam has been made, confirmed or recognised by the Government" అనిఉన్నది కాబట్టి ఖండ్రికలో ఏ కొద్ది భాగానైనా minor ఈనాంగా యిచ్చినట్లయితే దానిని గురించిన ప్రశ్న లేదు Hamlet ను లేక Khandrika ను ఈనాంగా యిచ్చి అంటే ప్రధానంగా అంతా కొద్దిగా మిగిలితే మిగలవచ్చు దానిని confirm చేసి, లేకుంటే దానిని recognise చేసేటపుడు అది estate క్రిందకు రావలసి ఉంటుందని ఈ Clause యొక్క అసలు ఉద్దేశం ఆ ఉద్దేశమును నెరవేర్చేందుకొరకే 1955 లో బిల్లు ప్రవేశ పెట్టేటపుడు అంతకు ముందు వచ్చిన judgment లను దృష్టిలో పెట్టుకొని main clause ను మార్చినపుడు ఇదివరకు వచ్చినటువంటి judgments ద్వారా హక్కుపోకుండా ఉంటే దాని కొరకు, Explanation 1 (A), I (B) ని మనం పెట్టటం జరిగింది ఆ దృష్టితోనే ఇపుడు మన మంత్రిగారు ' to be of a named village, hamlet or khandrika in an inam village" అని ఉన్నదానిలో 'in an inam village' తీసివేయమంటున్నారు 'In an inam village' అనే దానిని ఇక్కడ omit చేసినపుడు పైనకూడా ఎందుకు omit చేయకూడదో నాకుఅర్థంకావడం లేదు అందుచేతనే consistent గా explananation ను ఏ ఉద్దేశంతో మార్చారో, అదేఉద్దేశంతో main clause లో కూడా 'in an inam village' అనే దానిని తీసి వేయడానికి మంత్రిగారికి ఉన్నభయమేమిటి? రైత్వారీ గ్రామంలో కాని జమీన్ గ్రామంలో కాని ఏకొద్దిభాగం యిచ్చినప్పటికీ కూడా అది అంతా ఈనాం క్రింద పరిగణించబడే అర్థం దీంట్లో వస్తుందేమోనని మంత్రిగారను కుంటున్నారు 4, 5 రోజులక్రితం ఈ బిల్లును చర్చిస్తున్నపుడు "in an inam village" అనే పదాలను తొలగించినా నాకేమీ అభ్యంతరంలేదు అన్నారు. కాని ప్రతిపక్షం పెట్టిన సవరణలో "in an inam village" అనేది omit చేశారు కాని, "in an inam made, granted, confirmed or recognised" అనే పదాలు చేర్చలేదు కాబట్టి, అక్కడ 'any inam' అన్నప్పటికి రైత్వారీ గ్రామాల్లో ఏభాగమైనా సరే 'inam estate' గా చేయాలనే ప్రతిపక్షంయొక్క ఉద్దేశ్యం, అందువల్ల దానిని ఆమోదించలేము అని ఆరోజున అన్నారు. Main clause లో "any inam" అనే దానినితీసి "any hamlet or khandriga, of which a grant as an inam has been made, confirmed or recognised" అనేది ఉంచితే సరిపోతుంది. Courts, లో విపరీతమైన అర్థాలు చెప్పేందుకు అవకాశం లేకుండా

పోతుంది అనే ఉద్దేశంతోనే నేను నా మొదట సవరణను ప్రతిపాదిస్తున్నాను ఇంకా మిగిలిన సవరణలను గురించి అవన్నీ వచ్చినపుడు మాట్లాడుతాను

శ్రీ బి శంకరయ్య అధ్యక్షా, నేను ఇందాకనే మనవి చేసినాను ఇపుడు ప్రభుత్వంవారు in an inam village అనే పదాన్ని ఒకచోటే (Explanation లో) తీసివేయమంటున్నారు కాని, ఇతరచోట్ల ఎక్కడైతే in an inam village అని వస్తుందో వచ్చిన అన్నిచోట్ల వానిని తీసివేయటానికికాదు, కుదరదు అని అంటున్నారు పూర్వపు ఆంధ్రరాష్ట్రములోని 11 జిల్లాలలో Government గ్రామాలకు ఇనాము hamlets, khandrigas కూడా attach చేయబడినాయి. ఈ hamlets, ఖండ్రిగలు అన్నిటినీ ఇనాములుగా యిచ్చి, made, confirmed లేక recognised మొదలైనవన్నీ ఇనాము గ్రామాలుగానున్న చిన్న గ్రామాలను ఒక పెద్ద గవర్నమెంటు గ్రామమునకు attach చేసినారు ఒక పెద్ద గ్రామం ఉన్నదంటే దానిచుట్టూ 10, 11 ఖండ్రిగలో, మజరాలో ఇనాంగ్రామాలు అటాచ్ అయిఉన్నవి అవన్నీకూడా 1802వ సంవత్సరంలో Inam Commission గుర్తించినపుడే, attach చేసి ఉండవచ్చు అంతకుముందు కూడా attach చేసి యుండవచ్చు ఆతరువాతకూడా attach చేసియుండవచ్చు ఇపుడు ఆ రికార్డు తీసుకవచ్చి యెవరు రుజువు చేయాలి ! భోగోలు అనే గవర్నమెంటు గ్రామానికి మజరాలుగా అక్కరాజువారి ఖండ్రిగ, చింతలగిరి వారి ఖండ్రిగ, యజ్ఞనారాయణవారి ఖండ్రిగ, ఈవిధంగా ఇనాం గ్రామాలు ఉన్నవి ఇదేవిధంగా సర్వేపల్లి అని గవర్నమెంటు గ్రామానికి రామదాసు వారి ఖండ్రిగ, అప్పయ్యగారి ఖండ్రిగ, మొదలగు ఇనాం ఖండ్రిగలున్నాయి ఈవిధంగా గవర్నమెంటు గ్రామాలకు ఇవన్నీ attach అయి ఉన్నాయి ఈ గ్రామాలనన్నిటినీ ఇనాములుగా యిచ్చారు Made, confirmed లేక recognised ఇవన్నీ అయినాయి కాని, Government గ్రామానికి attach అయినాయి కనుక ఈ విధమైన ఇనాం ఖండ్రిగలు కాని, ఈనాం మజరాలు కాని inam estates గా కోర్టులు అంగీకరించడము లేదు ఇది న్యాయంకాదు. వీటినికూడ ఎస్టేట్లుగా పరిగణించేటట్లు చేయడానికే 1954 వ సంవత్సరంలో ప్రకాశంగారి ప్రభుత్వం in an inam village అని లేకుండానే any hamlet or khandrika అని చెప్పి Bill తయారుచేశారు ప్రభుత్వం దీనిని శాసనంగా చేయకముందే గవర్నర్ గారి పరిపాలన వచ్చింది. కాబట్టి గవర్నర్ గారు దానిని ordinance గా చేశారు అప్పుడుకూడా దానిలో, any khandriga or hamlet అని ఆ Ordinance లో పెట్టారు కాని, "in an inam village అని పెట్టలేదు దానిని President Act గా కూడా చేశారు అందువల్ల 1954 నుంచీ 1956 వరకు ఇనాంరైతులకు తాత్కాలికమైనరక్షణ

కల్గింది మీరు ఈనాం village లో లేరు, అది estate కాదు కాబట్టి మిమ్మ ల్నందరినీ కూడా భూములనుంచి తొలగించుతామని అనడానికి వీలులేకుండా పోయింది అప్పుడు వారు తయారుచేసిన Bill కాని గవర్నరు ఆర్డినెన్సుగాని President చట్టంకాని అన్నీ మనవద్ద ఉన్నాయి వాటినన్నిటిని పరిశీలిస్తే ఎక్కడా, 'in an inam village' అనేది లేదు అందువల్ల made, confirmed or recognised వల్ల వచ్చిన హక్కులన్నీ సిస్తు వసూలు చేసుకోడానికి మాత్రమే అధికారము ఇవ్వగలవు గ్రామాలు దానం యిచ్చేటప్పుడు, అంతకుపూర్వం రైతులు ఆ భూములలో ఉంటారని, వ్యవసాయం చేసుకుంటూ ఉండినారని దానమిచ్చినవారికున్న హక్కు రైతులవద్ద శిస్తు వసూలుచేయడం మాత్రమేనని ఈ ప్రభుత్వం అంగీకరించి యున్నది దానమిచ్చినటువంటి, పెద్ద పెద్ద గ్రామాలలో యెటువంటి హక్కులు (శిస్తు వసూలు చేసుకొనేటటునంటి హక్కు) ఉన్నవో అదేవిధమైన హక్కులు ఈ మజారాలు, కంద్రికలు కూడా వారికి ఉన్నవి అంతకన్నా మించిలేవు Government గ్రామాలకు attach చేసినప్పటికి, మొత్తం గ్రామం అంతా యివ్వకుండా, ఒక portion ను లేక మజారాలు కంద్రిగలు మాత్రమే యిచ్చినప్పటికి కూడా వాళ్ళకు ఆరోజు ఉండే టటువంటి అధికారం ఈ శిస్తు వసూలుచేసుకొనేందుకే. అందువల్ల మేలివరం హక్కే వారికి ఉండేది. కాని దానపత్రములో మేలివరం, కుడివరం హక్కు లని కూడా వ్రాసిఉండవచ్చు, తదితరమైనవయినా వాళ్లు వ్రాసిఉండవచ్చు కాని, రైతులు అంతకుపూర్వం ఉన్నారు శిస్తులు చెల్లించుకుంటున్నారు మన దేశంలో ఎప్పుడూ, పూర్వంనుంచీ కూడా ఉన్న సాంప్రదాయం ఏమిటంటే భూములనుంచి రాజులు ఎవర్నీ తొలగించేవారుకాదు. భూములనుంచి తొలగించే సాంప్రదాయం ఎప్పుడూ లేదు. శిస్తు వసూలుచేసుకొనేదే పరిపాలకులకున్న హక్కులు. Occupancy right ఎప్పుడూ రైతులకే ఉంటూవచ్చింది అందువల్ల అటువంటివాళ్లు ఇచ్చినటువంటి ఈనాం గ్రామాలలో, గ్రాంటు పొందినవాళ్ళకు శిస్తులు వసూలుచేసుకొనేదానికి మాత్రమే అవకాశం ఉంటుంది కాని దానం ఇచ్చినటువంటివాళ్ళకు లేనటువంటి హక్కు పుచ్చుకున్నటువంటివాళ్ళకు లేదు. పుచ్చుకున్నటువంటివాళ్ళకు భూములనుంచి రైతులనందరినీ తొలగించేసి, భూములు తీసుకొనే హక్కు లేదు.

భూమిని సాగుచేసుకొనే హక్కు రైతుకే ఉండడమనేది మనదేశంలో అనుశ్రుతంగా వస్తున్న సాంప్రదాయం. బ్రిటిష్ ప్రభుత్వంవారు కూడా దీనిని గుర్తించి ఎస్టేటు లాండ్ చట్టాన్ని పాస్ చేయడం జరిగింది. ఈనామ్‌దారుకు ఇచ్చిన టైటిల్ డీడ్ లో రెండు వారములు ఆయనకే ఉన్నట్లు వ్రాసియిచ్చినప్ప టికి, కుడివరం హక్కు రైతుకే ఉండాలిగాని యీనాందారుకు ఉండకూడదనీ,

కుడివరం హక్కు వ్రాసియుండిన సందర్భాలలో దానిని రద్దుచేయుటకు రైతు ఒక సంవత్సరం శిస్తు యీనాందారుకు అదనంగా ఇచ్చినట్లయితే రైతుకే కుడివరం హక్కు ఉంటుందని చెప్పారు ఆ విధంగా 1936 వ సంవత్సరంలో చట్టం సవరించడం జరిగింది కాని 1948 వ సంవత్సరంలో చేయబడిన ఎస్టేటు అబాలిషన్ చట్టంలో వీటిని మినహాయించారు 1956 వ సంవత్సరంలో చేసిన ఎస్టేట్సు లాండు సవరణ చట్టంలో ఇనాం రైతులకు న్యాయం జరుగలేదు రైతులు ఎంతోకాలంగా సాగుచేస్తున్న భూములను రైతులకు పట్టాలు ఇప్పించవలెను గాని యీనాందారులకు ఇవ్వడం న్యాయంకాదు కాబట్టి ఈ క్లాజులో ఉన్న "in an inam village" అనే మాటలను తీసి వేయవలసినదని కోరుతున్నాను

శ్రీ కె వెంకటరావు ఈ సవరణను అంగీకరించలేను

*Mr Speaker* The question is

"Add the following new Sub-clause as Sub-clause (1) of Clause 2 —

"(1) In Sub-clause (ii) of Sub-clause (d) *Omit* the words "in an Inam Village" after the words "any hamlet or Khandriga "

The motion was negatived

*Sri P Sundarayya* I demand a division, Sir

The House then divided

Ayes 34 Noes 60

The motion was negatived

*Sri P Sundarayya* I beg to move .

"Add the following new-clause as Sub-clause (v) —

"(V) In Explanation (1-A), Omit the words "in an Inam Village", after the words 'hamlet or Khandriga'.

*Mr Speaker* Amendment moved.

*Sri Pillalamarri Venkateswarlu*. I beg to move :

"In explanation (1) delete the words "in an Inam Village" wherever it occurs and in explanation (1-A) delete the words "in an Inam Village."

*Mr Speaker* Amendment moved

శ్రీ పి సుందరయ్య అధ్యక్షా, "in an inam village" అనేమాటలను అసలు క్లాజులో నుంచి తీసివేసినట్లయితే దాని యొక్క స్కోప్ ఎక్కువ అవుతుంది అన్నారు అయితే ఎక్స్ప్లనేషన్‌లోనైనా యీ మాటలను పూర్తిగా తొలగింపవలెనని కోరుతున్నాను ఎక్స్ప్లనేషన్‌లోని 4 వ పంక్తిలో ఈ మాటలను తీసివేసిన రెండవ లైనులో ఆ విధంగానే ఉంచారు ఒకచోట యీ మాటలను తీసివేసి ఇంకొకచోట వీటిని ఉంచవలసిన అవసరమేమీ లేదని మనవిచేస్తున్నాను దీనివల్ల ఒక సందిగ్ధపరిస్థితి ఏర్పడి, కోర్టులలో దీని భావమేమి తెలువలేదు అనేవిధంగా నిర్వచనాలు చేయడం జరుగుతుంది కాబట్టి "In an Inam village" అనే మాటలకు ఎక్స్ప్లనేషనులో నుంచి పూర్తిగా తొలగించవలెనని కోరుతున్నాను

* శ్రీ పిల్లలమర్రి వేంకటేశ్వర్లు శ్రీ సుందరయ్యగారు ప్రతిపాదించిన సవరణను నేను బలపరుస్తున్నాను "In an Inam village" అనే మాటలకు ఎక్స్ప్లనేషన్‌లో అవసరంలేదు ఇంకొక విషయం కూడా మనవిచేస్తాను. ఈ భూములు ఈనాములు అవునా కాదా అనే విషయాన్ని, రైతులకు పట్టాలు ఇచ్చారా లేదా అనే విషయాన్ని రుజువుచేసుకోవలసిన భారం రైతుల మీదనే ఉన్నదని కోర్టులు అంటున్నాయి ఈనాందార్ల దగ్గరనే టైటిల్ డీడ్స్ మొదలైన కాగితములన్నీ ఉంటాయి వారికి అవసరమున్నప్పుడు వారు యీ కాగితాలను పైకి తీసుకొనివస్తారు కాని రైతుల హక్కులు కాపాడవలసివచ్చి నపుడు కాగితాలు పోయాయి అంటారు అందువల్ల రైతులకు అన్యాయంజరిగే అవకాశం ఉంది. ఒకప్పుడు యీనాం భూమిగా ఉండి, తరువాత రైత్వారీ గ్రామానికి అటాచ్ అయిఉన్నవాటిని కూడా ఎస్టేట్సుగా డిక్లేర్ చేస్తున్నాము మన ఉద్దేశంనెరవేరాలంటే ఈనామ్, ఈనామ్ విలేజి, అనేమాటలు తీసివేయాలి లేకపోతే రైతులపై బర్డెన్ ఆఫ్ ప్రూఫ్ పడుతుంది కాని ఈనాందారుల మీద పడదు ఈ పరిస్థితి రాకుండా చూడవలసిన బాధ్యత ప్రభుత్వంమీద ఉన్నది ఆ రైతులు ఎట్లా రుజువుచేసుకుంటారు? ఆ రుజువు భారం తప్పిస్తే రైతులకు చిక్కుపోతుంది. ఎక్కడైనా "in an inam village" అని వుంటే, మంత్రిగారు చెప్పినట్లు, రైత్వారీ గ్రామాలకు original గా ఖండ్రికలు attach చేస్తే వర్తించదు. ఈనాం గ్రామాలలో వర్తించకుండా ఉండి prove చేసుకొనుటకు రైతులకు అవకాశంలేని పరిస్థితిలో, అతనికి ఈ బాధ్యత లేకుండా చేయటానికి వీలుంటుంది. కనుక దీనినైనా మంత్రిగారు అంగీకరించమని కోరుతున్నాను.

శ్రీ కె. వెంకటరావు: అంగీకరించను.

శ్రీ బి శంకరయ్య ఒకచోట మారుస్తున్నారు కాబట్టి రెండు చోట్లా మార్చుటకు అంగీకరించవలెనని మంత్రిగారిని కోరుతున్నాను

మిస్టర్ స్పీకర్ Explanation (1) లో రెండవ పంక్తిలో మారుస్తున్నారు మంత్రిగారు 4 వ పంక్తిలో కూడ మారుస్తారా ?

శ్రీ కె వెంకటరావు అది నేను ఆలోచించి చేసినదే It is very clear in my mind మొట్టమొదటిది మార్చడంవల్ల అసలుపోదు వారు మొదట నుంచి చేస్తున్న ఆందోళనకు అనుకూలంగా ఉంటుంది రెండవది మార్చటంవల్ల నేను అనుకున్నది జరుగుతుంది రెండూ మార్చటంవల్ల inconsistent అవుతుంది కాబట్టి రెండవది మార్చాలి మొదటిది అక్కరలేదు

*Mr Speaker* The question is

"Add the following new sub-clause as sub-clause (v)

'(v) In Explanation (1-A), omit the words 'in an inam village', after the words 'hamlet or khandriga' "

The motion was negatived

*Mr Speaker* The question is .

"In Explanation (1) delete the words 'in an inam village' wherever it occurs' "

The motion was negatived

*Mr Speaker* The question is

"In Explanation (1-A) delete the words 'in an inam village'."

The motion was negatived.

*Sri P Sundarayya* *Mr. Speaker*, Sir, I beg to move

"Add the following new sub-clause as sub-clause (ii) of clause 2

'(ii) In Explanation (1), omit the words 'is expressed to be of a named village', and substitute the words 'in a village' "

*Mr Speaker* Amendment moved.

శ్రీ పి. సుందరయ్య . ఈ అమెండుమెంటులో 'in a village' లేక 'of a village' అని వుంచినా నాకు అభ్యంతరం లేదు. మిగిలినది 'made, confir-

med and recognised' అని వస్తున్నది ఈ విషయంలో మంత్రిగారు జాగ్రత్తగా ఆలోచించి చేయాలి హైకోర్టు జడ్జిమెంట్సు స్పష్టముగా ఉన్నవి. ఆ పేరుతో ఇస్తేతప్ప లేకపోతే ఈనాం గ్రామంగా పరిగణించుట లేదు అని స్పష్టముగా చెబుతున్నారు. ఎవరైనా ఈనాం యిచ్చేటప్పుడు మొత్తం గ్రామమంతా యిస్తే గ్రామం పేరు ఉదహరిస్తారుగాని, గ్రామంలో 800 ఎకరాలుండి, 790 ఎకరాలు ఈనాముగా యిచ్చినా, గ్రామం పేరంతా ఈనాముగా యిచ్చినట్లు వ్రాయరు ఈ Explanation లో

"that it did not include certain lands which have already been granted on service or other tenure or been reserved for communal purposes " అని ఉంది

గ్రామం అంతా పూర్తిగా యివ్వక, అందులో కొంత భూమిని ఇంకొక tenure క్రిందనో, communal purposes క్రిందనో యిచ్చినట్లయితే ఈనాంక్రింద పరిగణించాలనే ఉద్దేశం తీసుకువస్తున్నప్పుడు, దానికి ముందు ఒక క్లాజు పెట్టడం, ఈనాం అని చెప్పి గ్రామం పేరుతో యిస్తే యిది వర్తిస్తుందని, ఆ పేరు mention చేయాలంటే, యిది నిజంగా మన ఉద్దేశానికి విరుద్ధంగా పోవటం అవుతుంది ఒక గ్రామంలో వెయ్యి ఎకరాలు ఉండి అందులో ఏ 20 ఎకరాలో మినహాయిస్తే అది minor inam క్రింద యిదివరకు చేసినారు ఇంకొక tenure క్రింద యిచ్చినా, communal purposes క్రింద రిజర్వుచేసినా ఆ village అంతా ఈనాముగా వ్రాయుట సాధ్యమా ? ఈనాముగా యివ్వదలచిన భూమికి ఫలాని గ్రామంలో యిన్ని ఎకరాలు అని హద్దులు వ్రాస్తారు. అటువంటప్పుడు ఆ గ్రామాన్నంతా మనం ఈనాంగా ఉదహరించటానికి సాధ్యం కాదు ఇక్కడ ఉన్న పదము "is expressed to be of a named village" అని ఉన్నప్పుడు "పేరు లేదు కాబట్టి యిది ఈనాం గ్రామం కాదు" అని హైకోర్టు జడ్జిమెంట్సు ఉన్నవి

చాలా జడ్జిమెంట్లు శ్రీ శంకరయ్యగారు, శ్రీ పిల్లలమర్రి వేంకటేశ్వర్లుగారు మొదలైనవారు చదివారు ఆ జడ్జిమెంట్సు ప్రింటెడ్ లా జర్నల్స్‌లో ఉన్నవి. మన ఉద్దేశాన్ని భగ్నంగావించే జడ్జిమెంట్లు వస్తున్నవి కాబట్టి "to be named" అన్న పదాన్ని తీసివేసి "in a village" అని బ్రాడ్‌గా అంగీకరించాలి కోర్టులు అనవసరమైన జడ్జిమెంట్లు చెప్పే అస్కారంలేకుండా మన ఉద్దేశం స్పష్టం చేసే దానికోసం, 'to be named' అన్న పదాన్ని తీసివేసి 'in a village' అన్నపదాన్ని చేర్చవలసిందిగా కోరుతున్నాను. కాబట్టి మంత్రిగారు నా సవరణను అంగీకరించాలని కోరుతున్నాను.

*Sri Pillalamarri Venkateswarlu* I am seconding the amendment, Sir

శ్రీ కె వెంకటరావు ఈ విషయం మొదటినుంచీ వస్తున్నది ఎంతసేపు ఆర్గ్యూచేసినా ఒకటే ఇదివరకు ఉన్న డిఫినిషన్నును ఏ కారణంచేతను ఎక్స్ పాండ్ చేయటానికి ప్రభుత్వం సిద్ధంగా లేదని మనవిచేస్తున్నాను మిత్రులు చెప్పే మెరిట్స్ ఆఫ్ ది కేస్ గురించి నేను ఆర్గ్యూచేయటం లేదు ఇప్పుడు తేబడిన డ్రాఫ్టింగ్ అమెండ్ మెంటు బిల్లుకు వారు పెట్టే సవరణలకు ఏవిధమైన సంబంధంలేదని మనవిచేస్తున్నాను ఈ బిల్లును వంకగా పెట్టుకొని, ఇదివరకు ఉన్న లా ను ఏవిధంగాను మార్చేందుకు అంగీకరించటానికి వీలులేదని తెలియ జేస్తున్నాను. కాబట్టి వారి సవరణను అంగీకరించటంలేదు

*Mr Speaker* The question is ·

" Add the following new sub-clause as sub-clause (ii) of Clause (2)

' (ii) In Explanation (1) omit the words 'is expressed to be of a named village' , and substitute the words 'in a village' "

The motion was negatived

*Sri P Sundarayya* I demand a division, Sir

The House then divided

Ayes 35 Noes 60

The motion was negatived

శ్రీ ఆర్ బి, రామకృష్ణరాజు (వడమలపేట) పాయింట్ ఆఫ్ ఆర్డర్ సర్ మా దగ్గర యీ బిల్లు ఉన్నది ఇప్పుడు వచ్చిన అమెండ్ మెంట్సన్నీ "ఎస్టేట్సు లాండ్ యాక్టు ఆఫ్ 1908"కు పెట్టినట్లుగా ఉన్నవి

*Mr Speaker* Estates Land Act as amended by the Act of 1956

*Sri R B. Ramakrishnam Raju* The Bill that is before the House is a Bill further to amend the Estates Land Act in the following words ..

*Mr Speaker* Of course, as amended uptil now.

ఎస్టేటు ల్యాండు ఆక్టు అంటే ఇవాళ్టివరకు సవరించబడిన ఎస్టేటు లాండ్ యాక్టు అన్నమాట ఎస్టేటు లాండ్ యాక్టు అంటే, 1908 లో

చేసిందేకాదు 1936, 1948, 1956 సంవత్సరాలలో సవరించబడినదంతా కూడ ఉన్నదే ఎస్టేటు లాండ్ యాక్టు అని అర్థము 1956 సంవత్సరపు చట్టమునకే వారు సవరణ పెట్టారు

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు ఇవాళ మనం చర్చిస్తున్నది "మద్రాస్ ఎస్టేట్సు లాండ్ బిల్లు" కాని 1908 వ సంవత్సరపు యాక్టుకు ఎమెండుమెంట్లు ఎట్లా వస్తాయి ?

మిస్టర్ స్పీకర్, ఆ సెక్షన్ టచ్ చేసినపుడు అందులో అన్నింటికి సవరణలు పెట్టవచ్చును. సెక్షన్ 3 (ii) (డి) 1936 వ సంవత్సరంలో ఒకసారి ఎక్స్పాండ్ అయింది 45 లో ఎక్స్పాండ్ అయింది 56 లో ఎక్స్పాండ్ అయింది ఆ విషయాన్ని దృష్టిలో పెట్టుకోవాలి దానిలో ఒక భాగానికి అమెండ్మెంటు పెట్టారు 1952 సంవత్సరంలో లేనిది 1956 లో ఉన్నది సెక్షన్ 3 (ii) (డి) టచ్ చేసినపుడు అన్నీ వస్తాయి

*Sri Pillalamarri Venkateswarlu*. I beg to move

"In Explanation (1) delete the word 'already' in the last line and add the following after the word 'granted', namely, 'on or before or subsequently "

*Mr. Speaker*. Amendment moved

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు : అధ్యక్షా, ఈ సవరణ ప్రతిపాదిస్తున్నాను ఈ జడ్జిమెంట్లన్నీ తిరగవేసి చూస్తే ఒక విషయం క్లియర్‌గా వ్రాసిఉన్నది "పూర్వము ఇచ్చిఉన్నది" అన్నదానికై తే నే ఇది వర్తిస్తుంది సబ్‌సిక్వెంట్‌గా ఇచ్చినదానికి వర్తించకుండా పోయే ప్రమాదం ఖచ్చితంగా ఉన్నది అటువంటివి కొన్ని ఉన్నాయి వీటన్నింటికి వర్తించేదానికొరకు నేను యీ సవరణ పెట్టాను ఈ సవరణ ఒప్పుకోకపోతే, న్యాయంగా రైతులకు రావలసినవి రాకుండా పోతాయి అందువల్ల నా సవరణను అంగీకరించవలసిందిగా మంత్రిగారిని కోరుతున్నాను.

శ్రీ బి. యల్లమందారెడ్డి : అధ్యక్షా, వారి సవరణను నేను బలపరుస్తున్నాను ఇది కేవలం ఒక చిన్నమాటకు సంబంధించిన సవరణ "have already been" అని చెప్పారు 'already' అన్నదానిమీద ఎన్నో ఇంటర్‌ప్రెటేషన్స్ చేయబడినవి. అల్‌రెడీ అని వ్రాసినపుడు, "ఎప్పుడిచ్చినదానిమీద" అని వస్తే "ముందు ఇస్తే నే" అన్న పాయింట్ కోర్టువారికి తేలనపుడు "ముందు ఇవ్వబడలేదు" అని రైతులు తేల్చుకోవాలన్నప్పుడు విపరీతంగా ఇంటర్‌ప్రెటేషన్

చేయటం జరిగింది కాబట్టి **"already"** అన్న పదం తీసేసి **"any time or subsequently"** అన్న పదం పెట్టాలని కోరుతున్నాను చిన్న ఇనాములకు సంబంధించి ఎలాంటి ఆక్షేపణ లేకుండా ఉండాలని మా సవరణ ఉద్దేశ్యము ప్రభుత్వమువారు దీనిని అంగీకరింపవచ్చును క్లియర్‌గా రెండుమూడు జడ్జిమెంట్సు మన ఉద్దేశానికి వ్యతిరేకంగా ఉన్నాయి కనుక మా సవరణను అంగీకరించాలని కోరుతున్నాను

శ్రీ బి శంకరయ్య ఇక్కడ **already** అనే పదము చేర్చటానికి ప్రభుత్వము ఎందువల్ల వ్యతిరేకముగ ఉన్నదో చెప్పమని అంటున్నాను ఎందుకంటే, 1945 వ సం లో ప్యాసు అయిన సవరణవల్ల **inam villages** అన్నీ కూడ **estates** క్రిందకు యింతవరకూ రావటానికి **scope** ఉన్నది ఆ విధముగా తీసుకునివచ్చే ఉద్దేశ్యము ప్రభుత్వానికి ఉన్నదనిచెప్పి ప్రభుత్వము తరపున తెలియజేస్తూ వచ్చారు అందువల్ల 1945 వ సం లో వచ్చిన **amendments** కే యీ **'already'** అనే పదము ఉన్నందువల్ల యీనాం గ్రామాలు అన్నీ ప్రభుత్వము యొక్క రిజిష్టర్లలో ఉన్నప్పటికినీ యీనాం గ్రామముగ ప్రభుత్వము ఇనాందారుల నుంచి జోడీ వసూలు చేస్తున్నప్పటికినీ, యీనాం గ్రామాలు అని చెప్పి అన్ని విధముల అంగీకరిస్తున్నప్పటికీ కూడ, 1945 సం పు సవరణ వల్ల **estate** అయ్యేదానికి **scope** లేకుండ తీర్పులు వచ్చినవి అలాంటి సందర్భములో ఆ గ్రామాలన్నీకూడ **estates** కావటానికి అవకాశము ఉన్నదని ప్రభుత్వము తరపున చెప్పేటప్పుడు యీ **'already'** అనే పదమును యీ రోజున తీసివేయటానికి వ్యతిరేకించవలసిన అవసరము లేదని, వ్యతిరేకించవద్దని కోరుచున్నాను లేకపోతే దానికి కారణములు ఏమిటోకూడ చెప్పవలసినదిగ మంత్రిగారిని కోరుతున్నాను

శ్రీ కె. వెంకటరావు · ఈ బిల్లులో యింకా విస్తృతము చేసేపని ఏదీ కూడ ప్రభుత్వము యికమీదట చేయదలచుకోలేదు **Merit** ను గురించి కూడ నేను జవాబు చెప్పదలచుకోలేదు అది అవసరమైనప్పుడు ఆలోచిస్తామని చెప్పాను సభ్యులకు దీనిమీద నమ్మకము లేకపోతే వారికి తోచిన **amendments** తెచ్చుకోవచ్చు

*Mr Speaker* The question is :

"In Explanation (1) delete the word 'already' in the last line and add the following after the word 'granted', namely, 'on or before or subsequently' "

The motion was negatived

*Sri P Sundarayya* I demand a division, Sir

The House then divided

Ayes 34 Noes 63

The motion was negatived

*Sri G Yellamanda Reddi* Sir, I beg to move

"In Explanation (1), delete the word 'certain', and substitute 'any portion' or 'portions of' "

*Mr Speaker* Amendment moved

*Sri Pillalamarri Venkateswarlu* I am seconding the amendment, Sir

శ్రీ జి యలమందారెడ్డి Explanation (1)లో certain land అని ఉన్నది. దీనికి 'any portion or portions of' అనేది వెంకటేశ్వర్లుగారు, నేను యిచ్చిన సవరణ ఇందులో certain land అంటే 'ఫలానా ఎ్ర చేను' అనేది, ఆవిధముగ ఉంటేనేతప్ప వీలులేదని కోర్టువారు interpret చేస్తూ రెండు తీర్పులు వచ్చినవి సభవారి ఎదుట యీ విషయమునుగురించి యింతకు ముందుగానే మనవిచేశాను. అందువల్ల "any portion or portions" అనేది మొత్తము ఆ యీనాము గ్రామాలలో ఏదైన ఒక చిన్నభాగముగాని లేకపోతే కొన్ని భాగములు కాని అని చేర్చినట్లయితే, దానికి మా ఆక్షేపణ ఏమీలేదు మా ఉద్దేశ్యముకూడ ఇదే గనుక "certain" అని చెప్పేదానిమీద దానియొక్క definiteness తెలియ జేయవలసి వస్తుందని హైకోర్టు తీర్పుయిచ్చింది గనుక అప్పుడు అవి తప్పనిసరిగ రావాలని finding వచ్చింది కాబట్టి దానిని తీసివేసి, "any portion or portions" అని పెట్టినట్లయితే చాలా సమంజసముగ ఉంటుంది మన Legislature యొక్క ఉద్దేశ్యముకూడ చాలాబాగా నెరవేరుతుంది గనుక, దీన్ని తప్పకుండ మంత్రిగారు అంగీకరిస్తారని మీద్వారా విజ్ఞప్తి చేస్తూ యీ సవరణను ప్రతిపాదిస్తున్నాను.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు : అధ్యక్షా, "మీ సవరణలన్నీ ముఖ్యమైనవేనని మేము అనుకున్నాము. అవి ముఖ్యమైనవి అయినా, కాకపోయినా, యివి యీనాడు consider చేసేదికాదు" అని మంత్రిగారు చెబుతున్నారు. అందువల్ల మేము యీ సవరణల విషయములో తయారుచేసుకుని వచ్చిన notes అన్నీ యీ విధముగ ఉంటే. వీటిని ఏమిచేయడమా, అనేది మాకు ఆలోచనగానే ఉన్నది. మేము మంత్రిగారికి ఎన్నిసార్లు చెప్పినప్పటికినీ, వీటి

విషయములో సరైన దృక్పధము మంత్రిగారు తీసుకోకుండ ఉన్నట్లుగా కన్పిస్తున్నది ఇప్పుడు దీనిలో మాకువచ్చిన difficulties ని గురించిచెబుతున్నాను ఈనాడు ఈ amendments pass చేసిన తరువాత కూడ ఈ "certain" అనే పదము యీ చట్టములో ఉంటూ ఉన్నది ఇది ఉండడమువల్ల కొన్నిచిక్కులు వస్తున్నవి మేము చెప్పినవి అన్నీ సరియైనవో కావో మీకేమి ఫరవాలేదు Inam రైతులకు ఏవిధముగాను అన్యాయము జరగదు అని ఒక్కమాటచెప్పితే, నష్టము కలుగుతుందో లేదో అని మేము ఆలోచించటానికి వీలు అవుతుంది నష్టము కలగనివ్వండి, కలగకపోనివ్వండి అది తరువాత మాట ఏమైనప్పటికినీ నేను యీనాడు మాట్లాడను అన్న ధోరణిని మంత్రిగారు తీసుకున్నారు అందులో దీనికి సంబంధించినవి చూచుకుంటే, certain అనే మాట యిందులో ఉంటే చాలా నష్టము కలుగుతుందని మా భయము పైగా ఇప్పుడు judgments ఉన్నవి గనుక వాటిని overcome చేయటానికి మనము ఏమీ చేయలేకపోతున్నాము అందువల్ల యీ చిన్నచిన్నమాటలను గురించి అయినా ఆలోచించమని మంత్రిగారిని కోరుతున్నాను

శ్రీ కె. వెంకటరావు . సభ్యులు చెప్పిన అన్ని విషయాలు నేను note చేసుకొనే ఆలోచనలో ఉంచడమైనది దానికి గూడ సమయోచితము, సందర్భము అంటూ ఉన్నది అవసరము వచ్చినప్పుడు వాటి సందర్భము వచ్చినప్పుడు ఆలోచించబడుతాయి గాని, యీ రోజున అవి ఆలోచించబడవు

*Mr Speaker* The question is

"In Explanation (1), delete the word 'certain', and substitute 'any portion' or 'portions of' "

The motion was negatived.

*Sri G Yellamanda Reddi*. I beg to move

"Add the following at the end of Explanation (1) —

'or for any other purpose or purposes'. ".

*Mr. Speaker* Amendment moved

శ్రీ జి యలమందారెడ్డి "Any other purpose" అని ఎందుకు పెట్టాను అంటే, Explanation II లో "service or other tenures have been reserved for communal purposes" అని వుంది ఈ వాక్యము అంతటితో అంతమైంది అందువల్ల అయితారు Judgments లో చూస్తే

ఒక జమీందారు మొత్తము గ్రామము యీనాముగా యిచ్చి, అందులోనే తాను స్వంతముగ పది ఎకరాలు వుంచుకున్నాడు అందువల్ల అది యీనాము ఎస్టేటు కాదని High Court వారు జడ్జిమెంటు చెప్పారు కనుక యింకా కొంతభాగము ఉంచే, 'for any other purposes' కు తాను స్వయముగ ఉంచుకోటానికి గాని, లేకపోతే యింకా ఏమైన పనులకు, అంటే చెట్లు వగైరాలు నాటుకోటానికి గాని, ఆయనకు ఏది యిష్టము అయితే అది, చేయటానికి కూడ అంగీకరించినట్లయితే, యీ పది పదిహేనుఎకరాలు minor inams ఉన్నప్పటికినీ మొత్తముమీద అది యీనాము ఎస్టేటు క్రింద నిర్వచనముచేయటానికి Section 3 (ii) (d) క్రిందకు వచ్చే యిబ్బందులను మాత్రము ఇది తప్పకుండ తొలగిస్తుంది అందువల్ల మంత్రిగారు దీనిని కొంత శ్రద్ధగా పరిశీలించి చూస్తే మంచిది ఇది చాలా సముచితము, సమయోచితముగా గూడ ఉన్నది అని నేను మనవిచేస్తున్నాను అందువల్ల మంత్రిగారు యీ సవరణ అంగీకరించమని కోరుతున్నాను ఇవి కోర్టువారు యిచ్చిన judgments లో వీటికి సంబంధించినటువంటి విషయాలే గాని, కొత్త విషయాలు ఏమీ చెప్పడములేదు మనము దీన్ని చట్టములో చేర్చడము వల్ల యిప్పటికి వచ్చిన judgments లో చూస్తే అందులో యిచ్చిన interpretation లో కొంత యిబ్బంది ఉన్నది గనుక, మనము అనుకున్న ఉద్దేశ్యము రాలేదు, గనుక ఆ anomaly తొలగించాలనిమాత్రమే యీ సవరణయొక్క ఉద్దేశ్యము. అందువల్ల "any portion or for any other purpose or purposes" అనేది చేర్చాలని అంటున్నాను. దీన్ని అంగీకరించవలసిందిగ కోరుతున్నాను

శ్రీ బి. శంకరయ్య ఈ సవరణను నేను బలపరుస్తున్నాను

శ్రీ కె. వెంకటరావు : నేను యీ సవరణను అంగీకరించడములేదు.

***Mr Speaker*: The question is .**

**" Add the following at the end of Explanation (1), 'or for any other purpose or purposes' ".**

**The motion was negatived**

***Sri Pillalamarri Venkateswarlu*. I demand a division, Sir.**

**The House then divided.**

**Ayes : 31 — Noes : 62**

**The motion was negatived.**

మిస్టర్ స్పీకర్ ఇంకా ముఖ్యమైన సవరణ వుంది అది రెండు విధాలుగా వచ్చింది శ్రీ జియలమందారెడ్డిగారిచ్చిన సవరణ యిలా వుంది

Add the following as sub-clause (iii) of clause 2 "(iii) for sub-clause (d) (i) of clause 2, for the words 'any inam village' substitute the words 'any villages which were designated as inam villages in revenue accounts "

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారిచ్చిన సవరణ యిలా వుంది

Add the following Explanation after Explanation (1-A)

"An inam is cxpressed to be of a named village", means, any inam which is designated or treated as village in revenue accounts "

రెండింటి భావము ఒకటే మొదటిదే బాగుంది కాబట్టి మొదటిదే move చేయడం మంచిది Whole clause కు మొట్టమొదటిది explanation గా వుంది అదే 'move' చేయండి

*Sri G Yellamanda Reddy* I beg to move

"Add the following Explanation after Explanation (1-A)

"An inam is expressed to be of a named village", means, any inam which is designated or treated as village in revenue accounts "

*Mr Speaker* Motion moved

* శ్రీ జి యల్లమందారెడ్డి ఇంతకుముందు శ్రీ సుందరయ్యగారు inam village సందర్భంలో మాట్లాడుతూ కొన్ని విషయాలు మనవిచేశారు. ఇదే సందర్భంలో named village అనేది ఎంత anomalous గా వుందో తమకు ఉదయమే రెండుతీర్పులు చదివి వినిపించాము. అందువల్ల 'named village' యిబ్బంది తొలగిపోవడానికిది బాగా తోడ్పడుతుంది; ప్రభుత్వం యొక్క ఉద్దేశం నెరవేరుతుంది కాబట్టి

మిస్టర్ స్పీకర్ ఆ 'named village' పోయింది కనుక అసలు దానికే సవరణ పెడితే బాగుంటుంది

శ్రీ జి. యలమందారెడ్డి · అందువల్ల 'named village' సరైనదేనని భావిస్తున్నాను. మంత్రిగారు దీనిని తప్పకుండా అంగీకరిస్తారని ఆశిస్తున్నాను. చల్లాయిపాలెం విషయంలో నిడమార్రు ధర్మాసనం అని contents లో వ్రాయబడలేదని, నిడమార్రు అనే ధర్మాసనం అనే వ్రాశారు కాబట్టి అది

inam estate కాదని 1956 వ సంవత్సరంలో ఒక finding వుంది క్రింది కోర్టువారు heading లో చల్లా యి పా తెం శ్రోత్రియం అనే దానికి పెద్ద importance యిచ్చారనీ, heading కు importance యివ్వవలసిన అవసరం లేదని, contents లోపలనున్న దానికే యివ్వాలనీ హైకోర్టువారు, శ్రోత్రియం చల్లాయిపాతెం అని లేదు కాబట్టి 'inam estate' కాదని తీర్పు ఇచ్చారు ఆ ఇబ్బందిని తొలగించడానికిది బాగా తోడ్పడుతుంది కాబట్టి మంత్రిగారు దీనిని అంగీకరించాలని కోరుతున్నాను ఇది సందర్భం కాదని వారు అంటున్నప్పటికీ తరువాతనయినా ప్రభుత్వం ఆలోచించడానికి బాగా తోడ్పడుతుంది కాబట్టి దీనిని అంగీకరించాలని తమద్వారా మంత్రిగారికి విజ్ఞప్తి చేస్తున్నాను

శ్రీ బి. శంకరయ్య నేను దీనిని బలపరుస్తున్నాను Revenue accounts లో అది inam గ్రామంగా వున్నదాలేదా అన్నది ముఖ్యమైనది, కాని ఎప్పుడో వంద సంవత్సరాల క్రిందటో 150 సంవత్సరాల క్రిందటో title deeds లో ఆ ప్రకారం వ్రాసియున్నారా లేదా అనేది కాదు వాళ్ళు యిచ్చినటువంటి గ్రాంట్ల మంజూరుపత్రాలను కూడా ఇనాంకమీషను యెదుటికి తీసుకుపోలేదు అనేక గ్రాంట్లు పోయినవని చెప్పి ఇనాందార్లు యిష్టంవచ్చినట్టు మంజూరు పత్రాలను వ్రాసుకుపోయారు "యీ విధంగా మాకు యింత భూమి యిచ్చివున్నారు; గ్రామం యిచ్చివున్నారు, గ్రామంలో భాగం యిచ్చి వున్నారు" అని ఇనాందార్లు చెప్పి ఆ విధంగా వాటిని గుర్తింప జేసుకున్నారు ప్రభుత్వం వాటన్నిటిని అంగీకరించినది ఈ రోజు legislation చేసేటప్పుడు యిదివరకటినుంచి భూమిని దున్నుకుంటూ ఒకరికొకరు అమ్ముకుంటూ occupancy rights వున్న రైతుల హక్కులు గుర్తించడం మాని వంద సంవత్సరాల క్రితం title deeds ఉన్న పదాలనుబట్టి శాసనం చేయడం న్యాయం కాదు ఇప్పటివరకూ Revenue accounts లో ఇనాం villages అని వున్నప్పుడు దాని ప్రకారం కోర్టులు follow అయ్యేటట్లు చట్టం యెందుకు సవరించ కూడదు ? ఆ విధంగా వాటిని further dispute లేకుండా ఒకేతడవ ప్రభుత్వపు register లో వుందా లేదా అని చూస్తే తేలిపోతుంది ఒక కోర్టు ఒక తీర్పు చెప్పగా యింకొక కోర్టు యింకో విధంగా చెప్పడానికి ఆస్కారం లేకుండా పోతుంది ఈ విషయాన్నే 'named village' గా ఉన్నపుడు ఎట్లా ఎస్టేటు గాకుండా పోతుందని' ప్రభుత్వం తరఫున రివిన్యూమంత్రిగారు చెప్పియున్నారు అందువల్ల వారు యిచ్చినటువంటి హామీకి అనుగుణంగా యీ ఒక విషయమైనా ఒప్పుకుంటారని ఆశిస్తూ, ఆ విధంగా ఒప్పుకోవాలని కోరుతూ యింతటితో విరమిస్తున్నాను.

శ్రీ కె వెంకటరావు లేదండి

*Mr Speaker* The question is

"Add the following explanation after Explanation (1-A) 'An inam is expressed to be of a named village', means, any inam which is designated or treated as village in revenue accounts "

The motion was negatived

*Sri B Sankariah* I beg to move

"In explanation (1-B) delete the word 'subsequently "

*Mr Speaker* Motion moved

శ్రీ పి సుందరయ్య మంత్రిగారు యీరోజు చెవులో దూదిపెట్టుకొని "మీరు ఎంత శంఖంవూదినా నేను వినిపించుకోదలచుకోలేదు" అనే ధోరణి తీసుకుంటున్నారు అందుచేత మేము చెప్పేది వారు వినినాకూడా ఆలోచించే స్థితిలో లేకపోయినప్పటికీ మా కర్తవ్యాన్ని నెరవేర్చవలసిన బాధ్యత మామీద వుంది కనుక మేము చెప్పకతప్పదు ఇదివరకు ఇనాంక్రింద ప్రకటించబడి **expressed** అనీ ఖండ్రిక అనీ మంత్రిగారు యిందాక చెప్పిన అన్నిటి ప్రకారం అయినప్పటికీ కూడా అది తరువాత రైత్వారీ గ్రామానికి గాని జమీన్ గ్రామానికి గాని అక్కడ రివిన్యూ లెక్కలలో చేర్చబడినప్పుడే యిది వస్తుంది గాని లేకపోతే రాదు అని ఆ **"subsequent"** అనే పదం పెట్టడం జరిగింది మామూలుగా ఒక గ్రామంమీద అధికారిగా ఉన్నటువంటి సామంతరాజో, ప్రభుత్వమో యినాంగా యిచ్చినప్పుడు కొంతభాగం యిచ్చినా అది యినాం క్రిందనే ఆరోజున లెక్కలోవుంటుంది అలాగే సొంతంలో వున్నటువంటి రైత్వారీ గ్రామంక్రిందనో జమీన్ గ్రామంక్రిందనో నమోదు అయితే మాత్రమే యీ చట్టంప్రకారం **estate** క్రిందికి వస్తుంది ఈ రోజు జమీన్ క్రిందనున్న 800 ఎకరాలలో 790 ఎకరాలు యీనాంక్రింద ప్రకటించి మిగతా 10 ఎకరాలు మాత్రమే జమీన్ క్రింద వుండినా, మొత్తంజమీన్‌గ్రామం అని వేస్తారనుకోండి అది **'subsequently'** రైత్వారీ గ్రామం అని రివిన్యూ **accounts** లో వస్తేనే యీ **explanation** ఉపయోగం ఉంటుంది. లేకుంటే లేదని అర్థంచెప్పడం అన్యాయం అవుతుంది అందుచేతనే కోర్టులు అటువంటి తీర్పులు యిచ్చినాయి. ఈ బిల్లు యొక్క దురదృష్టం అంతా యేమిటంటే శాసనసభ యొక్క ఉద్దేశ్యము ఒకటి, ప్రభుత్వం యొక్క ఉద్దేశ్యము ఒకటి వుంటే కోర్టులు యింకో ఉద్దేశ్యము చెబుతున్నాయి మాటలనుబట్టి గాని, మనకు అంతగా ఆలోచనాశక్తి లేకపోఒట్టి మనం అనుకోనటువంటి అర్థాన్ని

కోర్టులు చెప్పడం మొదలుపెట్టినప్పుడు దానినిగురించి మనం జాగ్రత్తగా వుండాలి "Subsequently" రైత్వారీ గ్రామాలుగాని జమీన్ గ్రామాలు గాని వస్తేనే యినాంల క్రింద పరిగణిస్తాం, లేకపోతే లేదని చెప్పడం, న్యాయంకాదు అంతకుముందు అది యినాం అని Register లో వుండదు గ్రాంటు యిచ్చి నప్పటికీ రైత్వారీ register లో వుంటుంది ఎక్కువ భాగం యినాం క్రింద యిస్తారు అటువంటి చోట అది inam estate క్రింద ఎందుకని పరిగణించరు? ఏదో ఒక tenure లో వుండాలి అంతకుముందు జమీన్ tenure క్రింద గాని, రైత్వారీ tenure క్రింద గాని వుండి తీరాలి అంటే ప్రభుత్వానికి సర్వాధికారాలు వుండాలి, వున్నప్పుడు దానిని యినాముగా యిచ్చారు ఇనాంగా యిచ్చినప్పుడు తరువాత అది inam register లో లేకపోయినా ఆ రోజు వుంటుంది, తరువాత ఏదో పొరపాటు జరిగితే, ఆ తరువాత రైత్వారీ క్రింద వుంటేనే చూస్తాను అంతకుముందుంటే చూడను అనే పద్ధతి సరైనది కాదు ఎన్నోవందల సంవత్సరాల క్రితం వున్న రికార్డులు వారిదగ్గర లేకపోయినప్పుడు ఆ రుజువు చేసుకోవలసినబాధ్యత రైతులమీద వుంటున్నది 'Either before on or subsequently' అనే పదాలవల్ల ఏ రకమైన క్రొత్త అర్థం వస్తుందో నాకు తెలియదు ప్రతి పర్యాయము మంత్రిగారు, "దీనిని విస్తృతం చేశారు, ఒప్పుకోను" అంటున్నారు మేము విస్తృతం చేయడం కాదు మీరు ఏ ఉద్దేశ్యంతో explanation లోని పదాలు మార్చాలనుకున్నారో ఆ ఉద్దేశ్యం యింకా స్పష్టంగా వుండడానికి ఒక పదం చాలదు, యింకోపదం చేర్చాలంటే "నేను అంగీకరించను; వినిపించుకోదలచుకోలేదు" అనడం న్యాయంకాదు శాసనసభ ముందు కారణాలు చెబితే అర్థం వుంటుంది అట్లా కాకుండా "నేను ఒక్కముక్క చెప్పాను. అది చాలదు, ఇంకో అరముక్క చేర్చమంటున్నారు నేను అరముక్క చేర్చను, ఒక అక్షరం కూడా చేర్చను" అనే దృక్పథం ప్రదర్శిస్తే శాసనసభలోని యీ చర్చలు దేనికోసము జరుపబడుతున్నవో నాకు అర్థముకానేకాదు.

'మీరు చెప్పినది ఏదీ నేను వినదలచుకోలేదు' అనే దృక్పథమును మంత్రిగారు మాని, వారు అనుకొన్న scope బైటకు పోతుందా? ఏరీతిగా విస్తృతము అవుతుంది? ఏ విధంగా రైతులకు నష్టం వస్తుంది? అనే విషయమును గురించి ఆలోచించాలి. క్రొత్త సిద్ధాంతము 'on or before' అనేదానికి కోర్టులో కొన్ని జడ్జిమెంటులు వచ్చినప్పుడు వాటిని clarify చేయటానికి చట్టం తెస్తున్నామని చెప్పారు. అప్పుడే ఇందులోని రెండు explanations కు సవరణలు తెచ్చారు. Explanation I కు Explanation I B కి సవరణలు తెచ్చారు "ఈ explanation లో మీరు చెప్పిన పదం చాలదు. యింకో పదం చేర్చండి" అని మేము

అంటే ఈ బిల్లును తలక్రిందులు చేస్తున్నామని మంత్రిగారు వాదించటములో అర్థం ఏమీ కన్పించటము లేదు కనుక ఆ విషయమును మరొకపర్యాయము ఆలోచించవలసినదిగా మంత్రిగారిని కోరుచున్నాను

* శ్రీ ఆర్ బి రామకృష్ణరాజు అధ్యక్షా, మంత్రిగారి అభిప్రాయము నాకు సరిగా బోధపడలేదు ఈనాం హామ్లెట్ అయినా, ఖండ్రిక అయినా, అది ఈనాం అనే పేరుమీద వుంటే, అది రైతువారీదని కాని, జమీందారీదని కాని రెవెన్యూ ఎక్కౌంటులో వ్రాసుకొన్నా ఫరవాలేదు. ఇచ్చినప్పుడు ఈనాం అని వుంటే అది సర్వకాలములలోను ఈనాము అని నేను అర్థం చేసుకొంటున్నాను వారు చెప్పినట్లు 'either before or after' అని పెడితే గ్రాంటుకు ముందు జమిందారీగా వుంటే ఈనాం గ్రాంటు ఇచ్చిన తరువాత మళ్ళీ జమీందారీ ఎట్లా అవుతుంది ? ఈనాముగా ఇచ్చేముందు జమిందారి గ్రామముగా వుంటుంది ఆ గ్రామమును జమిందారు ఇనాముగా ఇస్తాడు అలా ఇచ్చిన తరువాత రెవెన్యూ ఎక్కౌంటులో పొరపాటున గాని, లేక ఏ కారణంవల్ల గాని రైతువారి అనో, జమిందారి అనో వ్రాసుకొంటారు అలా వ్రాసుకొన్నా లెక్కకురాదు ఇచ్చినపుడు ఈనాంగా ఇస్తే అదే ఖాయం అని దానికి అర్థం'

* శ్రీ జి. ఎల్లమందారెడ్డి అధ్యక్షా, గౌరవనీయులైన శ్రీ రామకృష్ణ రాజుగారు చెప్పింది వాస్తవమే ఈనాం గ్రామం 'there of' కాని 'part' గాని అయివుండి, తరువాత జమిందారి గ్రామానికి గాని, ప్రభుత్వ గ్రామానికి గాని attach అయివుంటే ఇబ్బంది లేదు అని చెప్పబడింది. కాబట్టి ఈనాడు అనేక గ్రామాలు జమిందారి గ్రామాలకు కాని, రైతువారి గ్రామాలకు గాని attach అయివున్నా ఫరవాలేదు అయితే ఏ 200 సంవత్సరాల క్రింద ఇవ్వబడి నప్పటికి ఈనాం గ్రామాలకు attach అయివుండాలని ఇప్పుడు prove అవాలి కాని ఇంతవరకు వచ్చిన జడ్జిమెంటుల ప్రకారం నిరూపించవలసిన బాధ్యత రైతుపైన వుంది అది ఈనాం గ్రామములకు సంబంధించినదో, కాదో కోర్టులో తేలకపోతే తప్పు రైతుది కనుక 1809 లో ఫలానా ఈనాం గ్రామానికి ఇది attach అయివుంది అని prove చేసుకొనే బాధ్యత 'subsequent' అనే మాట వాడటం వల్ల అతనిపై పడింది. 'Subsequent' గా attach అయినదా ? లేదా అని prove చేసే బాధ్యత ఎవరిపైనా వుండకుండా అది కండ్రిగ అయినా ఈనాం అయినా రద్దుఅయి ఈనాం ఎస్టేటు కావాలనే ఉద్దేశ్యంతో ఈ సవరణను మేము ప్రతిపాదించాము.

* శ్రీ కె. వెంకటరావు అధ్యక్షా, నేను చెవుల్లో దూది పెట్టుకొన్నానని సుందరయ్యగారు చెప్పారు తడిమిచూచుకొంటే దూది కనబడలేదు ప్రతి విషయము వినిపిస్తోంది నా desk మీద చూస్తే వారు move చేసిన ప్రతి amendment కు ఒక నోటు తయారుచేసుకొన్నాను కాని వాటి పూర్వాపర సంబంధాలు పెట్టుకోకుండా నేను మాట్లాడటము లేదు చెవులకు వినిపిస్తు న్నాయి కళ్ళకు కనిపిస్తున్నాయి ఈ drafting amendment ను అవకాశంగా తీసుకొని Section 3 (ii) (d) లో 50 సంవత్సరాల నుండి లిటిగేషన్‌లో వున్న వాటిని ఒక్కసారిగా settle చేసుకుందామనే యత్నానికి నేను వ్యతిరేకినని చెప్పానుకాని యింకోటి చెప్పలేదు దీనికి సంబంధించినంతవరకు వున్న legal opinion ఇది

"Under explanation 1 (b) to Section 3 (ii) (d) any Inam Khandriga or Hamlet which was once part of an Inam Village is deemed to be an Estate even though it was subsequently designated in the revenue accounts as part of a ryotwari or zamindari village for administrative convenience or some other purpose"

"The intention of the amendment is that an Inam hamlet or Khandriga which was once part of a ryotwari or zamindari village but has subsequently formed part of an Inam village should be treated as an Estate It would seem that the amendment is only unnecessary inasmuch as Inam hamlet and Khandrigas which would now form part of an Inam village would automatically become estates by section 3 (2) (d) (ii). It is not therefore necessary to refer to the explanation in such cases which applies to Inam hamlets or Khandrigas now forming part of ryotwari or zamindari villages The amendment does not fit in with the concluding words 'came to be designated' in explanation 1 (b)."

అందుచేత ఇది ఒప్పుకోటానికి వీలులేకపోయింది. రాజుగారు చెప్పిన విధంగా వుంటేనే వారి భావానికి ఎక్కువ అనుకూలంగా వుంటుందని నేను అనుకొంటున్నాను. అయినప్పటికీ ఇప్పటికి ఈ లెజిస్లేషన్ పూర్తి అయినదని అనుకొంటున్నాను. యింకా దీనిలో ఏమైనా లోపాలు కనిపిస్తే వాటికి చేయ తగిన చర్యలు తీసికొంటామని మనవిచేశాను అంతకంటే నేను చెప్పవలసింది ఏమీ లేదు

*Mr. Speaker:* The question is:

"In explanation (1-B) delete the word 'subsequently'."

The motion was negatived

*Mr Speaker* The question is

"That Clause 2, as amended, stand part of the Bill"

The motion was adopted

Clause 2, as amended, was added to the Bill

*Clause* 1

*Mr Speaker* The question is

"That Clause 1 stand part of the Bill"

The motion was adopted

Clause 1 was added to the Bill

*Preamble*

*Mr Speaker* The question is

"That the Preamble stand part of the Bill"

The motion was adopted

The Preamble was added to the Bill

*Sri K Venkata Rao* Sir, I beg to move

"That the Madras Estates Land (Andhra Pradesh Amendment) Bill, 1957 be passed into law"

*Mr Speaker*. Motion moved.

శ్రీ పి సుందరయ్య. అధ్యక్షా, నేను ఈ మూడవ రీడింగులో కొన్ని కొన్ని విషయాలపై మంత్రిగారికి విజ్ఞప్తి చేయవలసి యున్నది ప్రభుత్వం ఏదైనా సవరణలు తెచ్చేటప్పుడు ఒక ఉద్దేశంతో తెస్తుంది. పరిమిత ఉద్దేశంతోనే తీసుకురావచ్చు అప్పుడు వారిదృష్టికి అంతమట్టుకే గోచరం కావచ్చు ఏదైనా ఒక సవరణ బిల్లు non-official గా వస్తే ఏండ్లు, తరాలు పడతాయనుకోండి పరిమితోద్దేశంతో తెచ్చిన సవరణ scope కు తగినంతగా ప్రజల ఇబ్బందులను దృష్టిలో పెట్టుకొని హైకోర్టువారి జడ్జిమెంటులను దృష్టిలో పెట్టుకొని ఇంకా కొన్ని సవరణలు తేవడం శాసనసభ్యుల హక్కు ప్రభుత్వం ముందుగానే సమగ్రంగా ఆలోచించి సవరణను తీసుకురావలసి ఉంటుంది కాని, ఆ రకంగా తీసుకురానప్పుడు శాసనసభ్యులు తెచ్చిన సవరణలను గురించి కూడా ఆలోచించాలి. ప్రభుత్వం తెచ్చిన సవరణలో కొన్ని యిబ్బందులు ఉన్నాయి అయినప్పటికీ ఆ సవరణను సభ్యులదృష్టికి తీసుకువచ్చి ఎంతత్వరగా ఆమోదింప చేయగలిగితే అంతత్వరగా ఆమోదించేటట్లు చేయాలి. అవసరమైతే ఈ రోజునే

ఆమోదించడం శాసనసభ్యుల కర్తవ్యం మేము ఆ కర్తవ్యాన్ని నెరవేర్చాలనే ఉద్దేశంతోనే కొన్ని సవరణలు తెచ్చాము ఇందులో ఏమైనా తప్పుఉంటే "మీరు అనుకున్నవి సరికాదు అనవసరంగా కంగారుపడుతున్నారు ఇప్పు డున్నదే బాగుంటుంది మేము పెట్టిన సవరణే బాగుంటుంది అని సభ్యులకు నచ్చచెప్పడానికి చూడాలి" తప్ప మేము ఏదో తెచ్చాము, మిగిలిన వాటన్నింటి విషయం మేము యిప్పుడు ఆలోచించదలచుకోలేదు, అన్నట్లయితే ఈ amendment Bill యొక్క ఉద్దేశం అసలు నెరవేరదు అసలు శాసనసభ్యులు చర్చించ డానికి విలువలేని పరిస్థితులు కూడా వస్తాయని మంత్రిగారు జ్ఞాపకం పెట్టు కోవాలని కోరుతున్నాను అంతేకాదు, కొన్నికొన్ని సందర్భాలలో appeal చేసే అధికారము ప్రభుత్వానికి 5, 6 రోజుల క్రితమే యిచ్చాము ప్రభుత్వం ఏ ఉద్దేశంతో ఈనాం రైతుల లాభంకొరకు ఈనాంలన్నింటినీ estates గా చేయాలని ఉద్దేశించినదో దానిని భగ్నంకావించే విధంగా Judgments వస్తు న్నప్పుడు, క్రింది కోర్టు, హైకోర్టు, సుప్రీంకోర్టు అన్నింటిలోకూడా రైతులే తేల్చుకోవాలని కాకుండా, ప్రభుత్వం చేసిన చట్టం అమలులో లేక, విపరీ తార్థాలు వస్తున్నప్పుడు తన శక్తిని ఉపయోగించి, Advocate-General ను ఉపయోగించి పై వరకూ దెబ్బలాడవలసిన బాధ్యత ప్రభుత్వం మీద ఉన్నది

కాని ఈనాడు ఆ రకంగా జరగడంలేదు. ఇకముందైనా ప్రభుత్వం బాధ్యత తీసుకొని పనిచేసినట్లయితే litigations వల్ల రైతులు నష్టపడకుండా వుండాలనే ఉద్దేశం నెరవేరడానికి వీలుంటుంది. మేము యిచ్చిన సవరణలలో ments లోకి మంత్రిగారు పోలేదు. "మేము అన్నింటికీ notes తీసుకొంటు న్నాము, ఆలోచిస్తాము, అవసరమైతే సవరణలు తీసుకువస్తాము" అంటున్నారు అంతవరకు మాకు సంతోషమే మంత్రిగారు చెవిలో దూది పెట్టుకువచ్చారా అంటే దూది పెట్టుకురాలేదని నాకూ తెలుసును. కాని దూది పెట్టుకువచ్చి నట్లుగా ప్రవర్తిస్తున్నారని నా ఉద్దేశం వినడంలేదు, చూడడంలేదు, వ్రాసు కోవడంలేదని కాదు అటువంటివన్నీ చేస్తున్నారు ఈనాడు చెవిలో దూది పెట్టుకుని వచ్చినట్లుగా ప్రవర్తిస్తున్నానని వారే చెప్పడం జరుగుతోంది. జడ్జి మెంటులవల్ల రైతులకు అనేక కష్టనష్టాలు వస్తున్నాయి. మనం ఇప్పుడు చేసిన చట్టాన్ని మనస్సులో పెట్టుకొని సమగ్రమైన సవరణ చట్టం తెస్తారని మాకూ తెలుసును. ఈ లోపున కోర్టులు రైతుకు వ్యతిరేకంగా తీర్పుయిస్తే వారు పై కోర్టుకు పోవలసివుంటుంది. ఈ సాధకబాధకాలను గుర్తించి ఈనాం రైతులకు అన్యాయం జరుగుతున్నప్పుడు ప్రభుత్వం తన Advocate General ద్వారా appeal పెట్టించి "కోర్టుయిచ్చినతీర్పు సరికాదు, ప్రభుత్వ

ద్దేశం ఫలానా" అని చెప్పి define చేయడానికి ప్రయత్నిస్తే ఈనాం రైతుకు కొంత ఉపశమనం కలుగుతుంది ఈ రీతిగా ప్రభుత్వంవారు చేయాలి అని కోరుతూ ఈ బిల్లువల్ల కలిగే కొద్దిపాటి లాభానికైనా దీనిని బలపరుస్తూ, మా సూచనలను కొంతవరకైనా అంగీకరిస్తే యింకా ఎక్కువ ఉపయోగకరంగా ఉండేదని భావిస్తూ, యిప్పుడున్నంతవరకూ ఈ బిల్లును బలపరుస్తున్నాము

* శ్రీ కె వెంకటరావు అధ్యక్షా, ఇప్పుడు సుందరయ్యగారు వెలిబుచ్చిన సదుద్దేశమే ప్రభుత్వానికి కూడా ఉన్నది 1908 నుంచి 1957 దాకా అనేక సవరణలతో, ఈ లోపల ప్రభుత్వాలు మారినా, - ఈ వ్యవహారాన్ని చేసుకోవడంలోనే దీనియందున్న గాఢమైన అవసరాన్ని ప్రభుత్వం గుర్తించిందని సభ్యులందరికీ తెలుసు ప్రభుత్వంవారు ప్రవేశపెట్టిన బిల్లులో ఉన్న లోపాలను నిరూపించడం ప్రతిపక్షంవారి ధర్మం వారికి హక్కు ఉన్నది కాని ఈనాడు నాకూ, వారికీ ఒక చిన్న విషయంలోనే బేధాభిప్రాయం ఉన్నది కాని, దీనిని amend చేయడానికి యిది సమయం కాదని మనవి చేస్తున్నాను బిల్లును తీసుకువచ్చే టప్పుడు సమగ్రంగా విచారించి తీసుకురావలసి ఉంటుందని వారు ఎదురుచెప్పారు అట్లా చేసేందుకే దానిని ఎన్నోసారులు తీసుకురావడం జరుగుతోంది దానినిగురించి ఎప్పటికప్పుడు చర్యలు తీసుకొంటున్నాము మాకుకూడా గోచరంకాని లోపాలు యిందులో ఉన్నట్లు ఈ వేళ నిరూపించారు 15, 16 amendments పెట్టారు దాంట్లో చెప్పిన ప్రతి విషయాన్ని గురించికూడా ప్రభుత్వం ఆలోచిస్తుంది ఎవరి ఉపయోగార్థం ఈ legislation అంతా ఆలోచించబడిందో వారికి ఉపయోగించే రీతిగా ప్రభుత్వం యివ్వవలసిన సలహా యివ్వడంలో ఎంతమాత్రం జంకడంలేదని మనవి చేస్తున్నాను ఈ బిల్లును శాసనం చేయవలసినదిగా సభ్యులను కోరుతున్నాను

*Mr Speaker* The question is:

"That the Madras Estates Land (Andhra Pradesh Amendment) Bill 1957 be passed into law."

The motion was adopted

## THE ANDHRA LAND REVENUE (ADDITIONAL WET ASSESSMENT) (ANDHRA PRADESH AMENDMENT) BILL 1957

శ్రీ పి. నరసింహప్పారావు (పాలకొండ) ఇప్పుడు time అయిపోయింది The Andhra Pradesh Land Revenue (Additional Wet Assessment)

(A P Amendment) Bill ను move చేస్తే, దానిమీద discuss చేయవచ్చు లేదా ఒంటిగంట వరకూ time యిస్తానంటే నాకు బాధలేదు.

మిస్టర్ స్పీకర్ Bill ను move చేస్తారు ఆ తరువాత చూద్దాము

I have to announce to the House that the following message dated the 21st October, 1957 has been received from the Governor of Andhra Pradesh —

"In pursuance of Article 207, Clause (1) of the Constitution of India, I Bhimsen Sachar, Governor of Andhra Pradesh, hereby give my recommendation to the introduction in the Andhra Pradesh Legislative Assembly of the Andhra Land Revenue (Additional Wet Assessment) (Andhra Pradesh Amendment) Bill, 1957

*Sri K Venkata Rao* · I beg to introduce The Andhra Land Revenue (Additional Wet Assessment) (Andhra Pradesh Amendment) Bill, 1957 and move that the Bill be referred to a Select Committee

*Mr Speaker* Motion moved

* శ్రీ కె వెంకటరావు · అద్యజా, నిన్ననూ, మొన్ననూ మన రాష్ట్రంలో ఉన్నటువంటి ఆదాయవ్యయ పట్టికకు సంబంధించిన విషయాలు చర్చించారు దానికి యింకా ఎక్కువ ఖర్చుచేయవలసిన విషయాలుకూడా ఈవేళ ఆమోదించారు. ఈ వేళ పెట్టిన బిల్లు తరువాత ప్రవేశపెట్టబోయే రెండు బిల్లులు కూడా ప్రభుత్వానికి ఈ వేళ ఉన్న ఆదాయవ్యయ విషయంలో ఉన్న లోపాలను తీర్చేందుకు. అంతేకాకుండా ఒక ప్రణాళిక క్రింద నడిపించబడే కార్యక్రమాన్ని పుష్టిచేసి మనం అనుకున్న కార్యక్రమాన్ని ఎక్కువగా అమలులోనికి తీసుకు రావాలనే ఉద్దేశంతోనే తీసుకురాబడుతున్నాయి ఇప్పుడున్న పన్నులను యింకా కొంచెం హెచ్చుచేయడం ఈ బిల్లులయొక్క ఉద్దేశ్యం ఈనాడు సభ్యుల ముందు ప్రవేశపెట్టబడిన బిల్లు తరువాత ప్రవేశబెట్టబోయే బిల్లులు రెండూకూడా అదే ఉద్దేశంతో ప్రవేశపెట్టబడుతున్నాయి ఆ బిల్లులు వచ్చినప్పుడు మిగిలిన విషయాలు మనవిచేస్తాను. ఈ వేళ ఈ బిల్లుకు సంబంధించిన విషయాలుమాత్రం మనవిచేస్తాను.

మన రాష్ట్రంలో నీటి పన్ను రెండు రకాలుగా ఉన్నది. ఒకటి, నీటి పన్ను క్రింద ఉన్న భాగం. రెండు, నీటి పన్ను భూమిశిస్తు - రెండూ కలిపిన

భాగం ఈ రెండవ దానిని wet assessment అంటారు మొదటి దానిని water rate అంటారు ఈ రకంగానే భారతదేశం అంతా ఉన్నాయి ఈ irrigation system చాలా కష్టతరమైన వ్యవహారం ఈ మధ్య భగీరథీ అనే పత్రికలో water rates గురించి 'వశిష్ఠ' అనే వారు మంచి article వ్రాశారు మన దేశంలో 4 రకాలైన నీటి తీరువా పద్ధతులున్నాయి (1) Crop rate system (2) Lease sysem (3) Flat rate system (4) Volumetric system ఈ volumetric system U P లో ముఖ్యంగా ఉన్నది ఎక్కడైనా tube wells ద్వారా వ్యవసాయం చేసుకుంటే ఇన్ని కుంచాల నీరు ఉపయోగించుకుంటే యిన్ని లిట్టరులు అని కొలిచియిస్తారు ఎక్కువ కుంచాల నీరు పుచ్చుకుంటే ఎక్కువ పన్ను తక్కువ కుంచాల నీరు వాడుకుంటే తక్కువ పన్ను దీనికి volu metric system అంటారు Flat rate system అనేది అన్ని రాష్ట్రాలలోనూ అమలులో నున్నది ఆంధ్ర ప్రదేశ్, మద్రాసు, మైసూరు, తిరువాన్కూరు - కొచ్చిన్ యిటువంటిచోట ఈ flat rate system ఉన్నది. అందులో ఏమి పండించారనేటటువంటి బాధ ప్రభుత్వానికి లేదు ప్రభుత్వాధారాలనుంచి నీరు తీసుకొంటే ఎకరానికి యింత పన్ను వేయాలనే నిర్ణయం దీంట్లో నూటికి 75 వంతులు water rate, మిగిలిన 25 వంతులు భూమి శిస్తు ఈ రెండింటినీ సమ్మిశ్రితం చేసినటువంటిది wet assessment ఈ పద్ధతి మన రాష్ట్రంలో కూడా ఉంది Lease system ఒకటి ఉన్నది ఒక ఏడాదికి ఇంత నీరు తీసుకుంటే యింత రేటు అని ఉంటుంది ఇది ఎక్కువగా బెంగాల్, బీహార్ రాష్ట్రాలలో ఉన్నది

Crop rate system చాలా చోట్ల Punjab, U P వగైరా ప్రదేశాలలో ఉన్నది వేసుకొన్నటువంటి పంట స్వరూపాన్నిబట్టి దాని రేటు నిర్ణయించడం. అరటితోట వేసుకుంటే 5 రూపాయలు, వేరుశనగ వేసుకుంటే 2 రూపాయలు, చెరకు వేసుకుంటే 10 రూపాయలు అది ఒక రేటుప్రకారం వేసుకొనేటటువంటి పంటనుద్దేశించి పన్ను ఇచ్చేటటువంటి system ముఖ్యంగా భారతదేశంలో యీ నాలుగురకాలైన పద్ధతులు ఉన్నాయి అయితే ఈ మొదటి పంచవర్ష ప్రణాళిక మొదలుపెట్టిన తరువాత మన దేశంలో నీటి పారుదల అభివృద్ధిని చాలా హెచ్చు స్థాయిలోనికి తీసుకువెళ్లే యత్నం నడుస్తోంది ఇది వరకు 1950–51 సంవత్సరంలో 5 కోట్ల 10 లక్షల ఎకరాల భూమికి నీటి పారుదల ఉండేది. 1955–56 నాటికి 6 కోట్ల 70 లక్షల ఎకరాల భూమికి అది ఎదిగింది. ఈ రెండవ పంచవర్ష ప్రణాళిక పూర్తి అయ్యేటప్పటికి 8 కోట్ల 80 లక్షల ఎకరాలకు నీటి పారుదల చేకూర్చాలని మన ప్రణాళిక నిర్ణయించింది.

ఈ సందర్భంలో మన రాష్ట్రం యొక్క పరిస్థితి ఎలా ఉందంటే, ఇవాళ మన రాష్ట్రంలో ఇపుడు వేసేవన్ను వేసినప్పటికీ కూడా మనకు వచ్చేటటువంటి ఆదాయం 172 లక్షలు 179 లక్షలు working expenses క్రింద అవుతున్నాయి 45 కోట్ల 7 లక్షల రూపాయలు మనం ఈ irrigation మీద మొత్తం ఇంతవరకు పెట్టిన పెట్టుబడి అయిఉన్నది అందువల్ల మనకు సాలుకు 172 లక్షలు వస్తున్నాయి 179 లక్షలు ఖర్చు కావడమువల్ల ఇంకా 108 లక్షల ఆదాయం తక్కువ ఉన్నది మనం ఇచ్చుకొనే వడ్డీ, ఇవన్నీ చూచినట్లయితే అందువల్ల ఈ భాగంలో కొంత కూడా మనం హెచ్చువన్ను రీతిని సంపాదించుకోలేకపోయినట్లయితే irrigation లెక్క చూచుకొన్నా మనకు తక్కువ ఆదాయం వస్తుంది దేశం మొత్తంమీద నడవవలసిన ప్రణాళికలబట్టి లెక్కలు వేసుకొన్నా మనకి అవసరం ఏర్పడిఉన్నది ఒక అవసరం, ఒక న్యాయం ఈ రెండింటినీ కూడా సమన్వయం చేసి చూసుకుంటే ఈ వేళ మన నీటి తీరువాను ఎక్కువ చేసుకోవలసినటువంటి ఆవశ్యకత ఏర్పడినది.

మిస్టర్ స్పీకర్ రేపు మంత్రిగారు కొదవ ఉపన్యాసమును సాగిస్తారు రేపు ఉదయం 8-30 గంటల వరకు సభా సమావేశము వాయిదా వేయబడినది

*The House then adjourned till Half Past Eight of the clock on Tuesday, the 5th November 1957*